# మల్లికాగుచ్ఛము



ఇది

శ్రీయుత మాడపాటి హనుమంతరావుపంతులు

గారిచేఁ రచియింపఁబడి

'సరస్వతీ నికేతనము' వారిచే

ప్రకటింపఁబడినది.


మచిలీపట్టణము.

౧౯౧౨




# అంకితము



ఎద్దాని

పంచమవార్షికోత్సవము నాఁడీగ్రంథరచన

సమాప్తియయ్యెనో

అట్టి

ఆంధ్రజాతీయ కళాశాలయొక్క

వర్థిత్యాగులగు

స్థాపకులకును, సర్వాహకులకును,

ఈగ్రంథము

భక్తిపూర్వకముగ

నంకితముచేయఁబడినది.

# విషయసూచిక







# పీఠిక

ఈ చిన్న పుస్తకమును గుఱించి రెండుమాటలు చెప్పఁ దలఁచియున్నాను. దీనిలోఁగల ఏడుకథలలో మొదటిది నాల్గవది తప్ప తక్కినవి ఉర్దూభాషయందు వ్రాయఁబడినకథల యనుసరణములు. వీనిలో నాలుగుకథలు 'ఆంధ్రభారతి' యందును ఒకటి 'కృష్ణాపత్రిక'యందును కొంతకాలము క్రిందట ప్రకటింపఁబడి యుండెను. మిగిలిన రెండుకథల నిటీవల వ్రాసితిని.

ఉర్దూభాషలోఁ బైనఁ జెప్పిన యయిదుకథలను వ్రాసిన కవి 'ప్రేమచందు' అనునతఁడు. రచనా కౌశల్యమునందును, ఇతివృత్త నిర్మాణమునందును నితఁడు, ఉత్తర హిందూస్థానమున ఖ్యాతిఁ గాంచిన వాఁడు. అట్టివాని వ్రాఁతలను దెనిఁగించుపని నావంటి యల్పజ్ఞుని చేతఁబడుటవలన మూలములోని సారస్యము చెడిపోయియుండు ననుట నిర్వివాదాంశము. కనుక, పాఠకు లిందలిగుణములు ప్రేమచందునివిగను, దోషములు నావిగను, భావింతురుగాక!

నాయీ ప్రథమగ్రంథము, ఆంధ్రసోదరుల యాదరముఁ బొందినచో ధన్యుఁడ నయ్యెదను.

౧౨౬, రెసిడెన్సిబజారు,
హైదరాబాదు (దక్కన్)
౨౮, మార్చి ౧౯౧౫.

మాడపాటి-హనుమంతరావు.

ముగాని ప్రాంతముగాని యాదేశమందుం గానరాదు. అయినను, మనమిప్పుడు ప్రస్తావించుచున్న దుర్గముపైన దినఱ కెన్నడును శత్రురాజుల పతాకము రెపరెప మటగాని, యాగ్రామమునం బరసేనల పాదచిహ్నము ల మటగాని, సంభవింపక పోవుట యచ్చట వారి యుత్కృష్టమే కదా !

అనిరుద్ధ సింహుండు వీరుండగు నొక రసపుత్రుండు. ప్రతిపురుషుండును వీరుండుగను శూరుండుగను నుండుట తప్పనియవసరముగం జేసిన యాకాల మాహాత్మ్యమే యట్టిది! ఒక ప్రక్క మహమ్మదీయ సైన్యములు సర్వసిద్ధముగ పైంబడ లేచియుండెడివి. వేఱొక ప్రక్క బలవంతులగు బుందేలురాజులు చిన్నరాజ్యముల నాధిపతులగు మాస్కులంగోం జూచుచుండెడివారు. అనిరుద్ధ సింహుని గొప్ప స్వల్పసంఖ్యాకమైనను, యుద్ధానుభవముగల మాశ్వికులు, పదాతులు, చేరియుండిన యొకి సేన యుండెను. తత్సహాయమున నతండు వంశగౌరవమును బూర్వికుల కీర్తిని స్వనియముగ రక్షించుకొనుచుండె వాండు. ఆకాలపు దొంగదొరలను బట్టి, యొకి స్వాస్థ్యమైన సుఖముగా నొక తాపునం గాలముం గడపు నవకాశ మాయనకు దొరకదయ్యె. శీతలా దేవిని బరిణయమై

మూఁడువత్సరములు మాత్రమే కడచినను, అనిరుద్ధ
సింహుని కోరికలతోడి దినములను, నాసలతోడి
రాత్రులును, పర్వతారణ్య ప్రదేశములందుఁ గడచు
చుండెను. శీతలాదేవి యనునిమిషమును భర్తృప్రాణ
ములఁగాపాడ భగవంతునకు వేయిమ్రొక్కు లిడుచుం
డును. "మీరు నాకన్నులయెదుటనుండి యెచ్చటికిని బోవ
లదు. నన్ను హరిద్వారమునకుఁ గొనిపొండు. బృందా
వనమును నాకుఁ జూపుఁడు. మీతోఁగూడ నరణ్యవాస
మునకైన సమ్మతించెదను. కాని ముందివియోగ
బాధను సహించఁజాల"నని పలుమాఱామె నాథు
నితో నుడివెను. ఆమె యతనికిఁ జనువునఁ జెప్పెను.
ప్రాయముతో ననెను. వినయముతో విన్నవించెను.
కాని యనిరుద్ధ సింహుండు శూరుఁడగు బుందేలుఁడు
కాన, శీతలాదేవి తనకడనున్న గోయూథముతోను
నాతని జయింపఁ జాలదయ్యె.

అంధకార పరీవృతమగు నా రాత్రివేళ ప్రపంచ
మంతయు నిద్రావస్థయందు నిమగ్నమై యుండినను,
నక్షత్రములు మాత్రము తమ యున్నత నివాసము
నుండి నిక్కినిక్కి చూచుచుండెను. శీతలాదేవి శయ్యా
పై నిటునటుఁ బొరలుచుండె నా సుకుమారపు బిడ్డ (భర్తృ

సోదరి)యగు సారంధ క్రిందఁ గూరుచుండి హృదయా
హ్లాద కరముగ నేదియో గీతమును బాడుచుండెను.
శీతలాదేవి:—"నన్నేల బాధించెదవమ్మా ! నావలెనే
నీకును నిద్రపట్టలేదా ?"
సారంధా:—"నీకొక పాట వినిపించు చుంటిని"
శీత:—"నిద్దుర నా కన్నులను వదలి యెచ్చటికో పోయి
నట్లున్నది"
సారం:—"ఎవ్వరినైన వెదుకఁబోయి యుండనోపును"
అంతలో ద్వారము తెరువఁబడి పొడవగు నాకా
రమును సుందర శరీరమును గల యావనుఁడొకఁడు
తడిసినకట్టు బట్టలతో నిరాయుధుఁడై లోనఁ బ్రవేశిం
చెను. శీత లాదేవి యదిచూచి సిగ్గుచముడిచి క్రిందఁ
గూర్చుండెను.

సారంధా యాపురుషుని జూచి "అన్నయ్యా!
అని రుద్ధసింహా ! నీబట్టతడిసి యున్నదేమి" అని విచా
రించెను.

అనిరుద్ధ:— "నదియందీది, దాటి వచ్చితిని"
సారం:—"ఆయుధము లేమైనవి?"
అని రుద్ధ:—"లాగికొనఁబడినవి"
సారం:—"పరిజనులో?"

అనిరుద్ధ :— వారందఱును రణరంగమున వీరశయన
మొనర్చిరి.

ఈ సంభాషణమును విన్నశీతలాదేవి "భగ
వంతుఁడా! నేఁటికి రక్షించితి" వని యీశ్వరుని బొగ
డెను. కాని సారంధాముఖము విచిత్రముగ మాఱెను.
ఆత్మ గౌరవ భావతీక్ష్ణత యామె వదనమున కెఱ్ఱరం
గును దెచ్చె. అంత నామె "అన్నయ్యా! వంశమర్యాదను
బోఁగొట్టితివిగదా! ఇదివఱ కిట్టిదెన్నఁడును జరిగి యుండ
లేదు" అని చెప్పెను.

తనను ప్రాణతుల్యముగఁ బ్రేమించు సోదరి పెద
వులనుండి పై కఠిన వాక్యములను విని యనిరుద్ధ
సింహుఁడు సిగ్గుచే వివర్ణుఁ డయ్యెను. అను రాగభరమున
నడఁగియుండిన యాతని సౌగప్ష [illegible] భగ్నమాఱెను.
అప్పుడాతఁడు "సారంధా! నీవు నాకు జీవితాంతము
వఱకు స్మరణీయం బగు చుకొనఁ దగిన గుణపాఠమును
నేర్పితివి. దీని నెన్నటికి మఱువ" ననుమాటతో
వచ్చిన దారిని మరల వెడలి పోయెను.

అంధకార బంధురమగు నారాత్రి, యాకసమ
మున రిక్కలు నిక్కి చూచుచుండ ననిరుద్ధసింహుఁడు
కోటదాటి, కనురెప్పపాటున నదిదాటి, మరలఁ దిమిర

సముద్రమున మునింగి యగపడకయ్యె. శీత లాదేవి భర్త వెంట కోటగోడవఱకుఁ బోయి యాయన యుర కుదుముకున గోడ దాటి యవతలఁ బడిన యొక శిలాతలమున నూలఁబడి విలపించుచుండెను.

అంతలో సారంధా యామెను గలసికొనఁగా శీతలాదేవి క్రోధదుఃఖాకులమగు మనస్సుతో "ఏమమ్మా! వంశమర్యాదయంత ప్రియమైనదా?" యని యనెను.

సారం:—అవును; మఱేమని తలఁచితివి?

శీతలా:—నీభర్తయైనచో హృదయ పేటిక యందు దాచికొనియుందువు.

సారం:—కాదు; కాదు! హృదయమును గుటారుగా వ్రక్కలు చేసియుందును.

శీతలా:—ఇవి మాటలే కాని క్రియలు కాజాలవు. పల్లకియందు దాచుకొని తిరుగఁగలవు. నామాట జ్ఞప్తియందుంచుకొనుము.

సారం:— ఇట్టిస్థితి సంభవించిననాఁడు నామాటను నేను నిల్పికొనుటఁ జూచెదవులే.

ఇది జరిగిన యాఱుమాసముల కనిరుద్ధసింహుఁడు "మహారాని" దుర్గమును జయించి యింటికివచ్చెను. తరువాత నొకసంవత్సరమునకు సారంధాకన్య చంపత్

రాయని కరగ్రహణ మొనర్చెను. ఈ విధముగ నా యువతీ మణులు విడిపోయినను, నాఁటి మాటలు మాత్రము వారిహృదయము లందు మెదలుచునే యుండెను.

---

## ద్వితీయరంగము

రాజా చంపత్ రాయఁడు సమర్థుఁడును, నున్నతోద్దేశపూరితుఁడును నగు రాజపుత్రుఁడు. బుందేలుల కందఱకును నాతఁడు ప్రాణసమానుఁడుగనుండె. అతని కనుబొమ్మలకదలిక మాత్రమున సేనలు యుద్ధమునకును, రాజ్యములు పరాభవ దుఃఖమునకును, సిద్ధపడుచుండెడివి. సింహాసనము నధిష్ఠించినప్పుడనే యాతఁడు మొగలాయి చక్రవర్తులకుఁ గప్పమిచ్చుటమానుకొని, కరవాలబలమునఁ దనరాజ్యమును విశాలముగఁ జేయ నారంభించెను. మహమ్మదీయ సైన్యములు మాటిమాటి కాతని పైకెత్తివచ్చుటయు, బరాభూతములై కాళ్ళకు బుద్ధిచెప్పుకొనుటయు, సంభవించుచుండెను. ఆవీరశిరోమణికొఱకు బుందేలు ఖండమంతయు ప్రాణత్యాగముచేయుటకు సర్వదా యుద్యుక్తమైయుండెడిది. అట్టి యశస్సామ్రాజ్యధురంధరుని ప్రేమకు ననిరుద్ధ

సింహుఁడు తన చెలియలి నప్పగించెను. సారంధా వాంఛలు నెఱవేరెను. తన భర్తబుందేలు ఖండమునకు శిరోభూషణముగ నుండవలయునను నామె మనోరథము సఫలమయ్యెను. చంపత్ రాయని రాణివాసమున నైదుగురు రాణు లుండినను మనఃపూర్వకముగఁ దన్నుఁ బూజించు యువతీరత్నము సారంధాతప్ప మఱెవ్వరును గారని యాతఁడత్యల్పకాలముననే గ్రహింపఁగల్గెను.

కొంతకాలమునకుఁ గర్మవశమునఁ గొన్ని కారణములు చంపత్ రాయని ఢిల్లీ చక్రవర్తికంకితునిగఁ జేసెను. రాజ్యమును, దదితరవస్తు సందోహమును, సోదరుఁడగు "పహాడ్ సింగున" కప్పగించి యాతఁడు ఢిల్లీకేఁగెను. అది షాజిహాను చక్రవర్తి పరిపాలన కాలముయొక్క తుదిభాగము. యువరాజు చంపత్ రాయని సమరప్రసంగముల నాశ్చర్యసంతోషములతో విని, సారవంతమును తొమ్మిది లక్షలరూప్యములు వచ్చుబడి గలదియును నగు "కాల్పి" ప్రాంతము నావీరునకు జాగీరుగనిచ్చి గౌరవించెను.

చంపత్ రాయని కనుదిన యుద్ధోద్యోగమునుండి విముక్తి కలిగిన దినములలోనిదియే మొదటిది. సవైభవముగను, ససౌఖ్యముగను గ్రొత్తరాజ్యమును బాలింప

మొదలిడెను. విశ్రాంతితోఁబాటు శ్రీమంతమున కను గుణములగు మార్పులు పొడసూపసాగెను. సుఖజీవన మందజను బ్రమత్తులుగఁజేసె. కాని సారంధామాత్ర మాదినములలో మనోవ్యాకులతకును, నిరంతరవిచార మునకును, గుఱియై యానందప్రధానములగు విందుల కంతగాఁబోఁగోరక యప్పటిసవ్యాజ సుఖముల నేవగించు కొనుచున్నదిగఁ గానఁబడుచుండెను.

ఒకనాఁడు చంపత్ రాయఁడు సారంధాతో "ప్రేయసీ! ఈనడుమ నీవుదాసీనత వహించియుండుటకుఁ గారణమేమి? ఒక్కమారైనియు నీసుందర ముఖార విందమును వికసితస్థితియందుఁ జూడనైతిని. నాయెడ నప్రియమా?" యని యడిగెను. సారంధాసాశ్రులోచన యై "నాథా! తామట్లేల తలంచెదరు? మీసుఖమే నాసుఖము. మీరు సంతోషముగనుండిన నేను సంతోషముగనున్న యట్లె" యని గద్గదస్వరమున నుత్తర మిచ్చెను.

చంప:—నేను ఢిల్లీకివచ్చినప్పటినుండి మున్ను నా నెమ్మ నమును హరించుచుండు కాంతివంతమగు నీచిఱు నగవు నొక్కమారైన నీముఖము నలంకరిం పఁగాఁ జూడనైతిని. కోమలములగు నీహస్తము

లీనకుమ నొక్కమారైనను నాకు విషయమిచ్చి యుండలేదు. నీవొక్కసారియైనను నాశిరోవేష్ట మును దిద్దలేదు. నీ కరమ్ము లొక్కతూరి యేనియు నాశరీరమున కాయుధమ్ములఁ దగిలింప లేదు. నిజముగా బల్కుము, సారంగ ! కారణ మేమి? నీకు నాపైఁగల యట్టి యనురాగపుఁ గ్రొత్తందనము త్రొలఁగి పోయినదనియే నేను భావించవలసినది."

సారం:— ప్రాణనాథా! నేను ప్రత్యుత్తరమియ్యఁ జాలనట్టి ప్రశ్నముల వేయుచున్నారు. నిజము గనే యీనడుమ నాహృదయము తేలికగ నుండుటలేదు. సంతోషముగనుండుటకు నేనెంత యో యత్నించుచుందును. కాని, యేదియో భారము నా యుత్సాహము నడచి పట్టు చుందును."

చంప:— (విచారముతో ఫాలమున ముడుతలువడ) "నాకు నీమనోవ్యథకుఁ గారణమే మాత్రమును దోఁచుటలేదు. ప్రియే ! నీవే చెప్పుము. నీకుఁగల కొదువ యెయ్యది? "ఓర్ఛా"యందు మాత్ర మింతకన్న నెక్కువ సుఖసాధనము లేవి

యుండెను." ఈ మాటలు విన్నపిదప సారంధ
మో మెఱ్ఱవారెను. అంతనామె "నేమైన ననిన
మీకుఁగోపము రాదేని చెప్పెద"ననెను.

చంప:— చెప్పుము. నిశ్శంకముగాఁ జెప్పుము.

సారం:— ఓర్ఛాయందు నేను రాణిగనుంటిని; ఇచ్చ
టనో నేనొక జాగీరుదారుని భార్యను. అయో
ధ్యయందుఁ గౌసల్యాదేవి యెట్టిపదవియం దుం
డెనో "ఓర్ఛా"యందు నేనట్టిపదవి ననుభవించు
చుంటిని. ఇచ్చటనో నేను చక్రవర్తినికిదాసిని.
ఏ రాజు నెదుట నేఁడు మీరు వినయమునఁ దల
వంచుచున్నారో, యారాజు నిన్న మీపేరు
విన్న భయోత్కంపితుఁడగు చుండువాఁడు. రాణీ
దశనుండి దాసిదశకు దిగియుఁ దొంటియట్లు
సంతసముగనుండుట నాచేతనగుచుండ లేదు.
మీరీవిలాసములను, విశ్రాంతిని, నత్యున్నత
మూల్యమునకుఁ గొనియున్నారు.

చంపత్ రాయని మనోదృష్టినంతకు మున్ను గప్పి
యుండిన మాయవిచ్చిపోయెను. అంతకు మునుపాతఁడు
సారంధాయొక్క యాధ్యాత్మికౌన్నత్యము నెఱుంగఁడు.
తన తల్లినిగూర్చిన ముచ్చటలు విన్నమాతృహీనుఁడగు

ఖాలునివలెనే "ఓర్ఛా"జ్ఞప్తికి వచ్చి, తోడనే చంపత్ రాయనిలోచన కమలము లశ్రుఫులతో నిండెను. అంతి నాతనికి సారంధాయెడ, దేవతపైన నవ్యాజోపాసకును కుండునట్టి భక్తి మనఃపూర్వకముగఁ గలిగెను. ఆనాఁటి నుండి, యేస్థలమునుండి విలాసాసక్తిఁ దన్నులాగికొని ఢిల్లీకిఁ దెచ్చెనో, యా పూర్వ నివాసస్థలమునకుఁ బోయి నివసింప నాతని మనసు తొందరపెట్టసాగెను.

చిరకాలమునుండి దూరముననున్న కుమారుని రాకచే నానందమునొందు తల్లివలె, చంపత్ రాయని యాగమనమువలన బుందేలు ఖండమంతయు హర్ష వారిధిఁదేలియాడెను. "జీరజ్" దుర్గముయొక్క సుప్త భాగ్యదేవత మేల్కొనెను. సంతోషసూచక భేరీ నినా దములు వీనులకు విందొనర్పసాగెను. సారంధాదృక్పథ దేశములందు చిఱునగవు మరలఁ దనకాంతిని జూపెను.

ఇచ్చటి నివాసమునఁ గొన్ని మాసములుగడ చెను. అంతలో షాజిహాను వ్యాధిగ్రస్తుఁడయ్యె. చక్ర వర్తి కుమారులలో మొదటినుండియే మనస్పర్థలుండి నవి. ఈవార్తనలుదెసలఁ గ్రమ్మఁగానే కలహాగ్ని ప్రజ్వ రిల్లెను. సమరసన్నాహము లారంభమయ్యెను. మురా దు మొహియుద్దీనులు తమసేనావారముతో దక్కను నుండి వెడలినడిచిరి.

వర్షకాలమున వనప్రదేశ మాద్యంతమును పచ్చనిపచ్చికతో నేత్రోత్సవ మొనరించుచుండెను. వృక్షలతాదులు వివిధవర్ణకుసుమములతో వనదేవత నలంకరించియుండెను. మురాదుమొహియుద్దీనులు, ఆతురతతో సాగిపోవుచుం నుదకు "ధోలపుర"సమీపమున చేంబల్ నదీతీరమును జేరి చూడఁగా నవతలియొడ్డున సార్వభౌమికసేన వారి నెదుర్కొన సిద్ధముగనుండెను.

చక్రవర్తి పుత్రులిరువురును కళవళపడఁజొచ్చిరి. ఎదుట నది విశాలముగఁ బ్రవహించుచుండె. అవతలి గట్టున విరాగిధైర్యమువలె సుస్థిరముగను, నినుపగోడ వలె దుర్భేద్యముగను, శత్రుసేనలు నిలచియుండెను. అప్పుడేమిచేయుటకును దోఁపక వారు "కరుణించి మమ్ము నీవిపత్తునుండి కాపాడుభారముమీది" అని వేడికొనుచు చంపత్ రాయనకు సందేశమంపిరి.

అంతట రాజు, రాణి వాసమునకేఁగి "ఈసందేశమునకేమి ప్రత్యుత్తర మియ్యఁదగు"నని సారంధాను బ్రశ్నించెను.

సారం:—సాయముచేయుట మనవిధి.

చంప:—వీరికిఁగేలూత నొసగుట దారాతో వైరము తెచ్చిపెట్టుకొనుటయేకదా!

సారం:— అవునుగాని శరణాగతత్రాణమున కన్న నుత్తమధర్మ మెచ్చటఁగలదు ?

చంప:—(యోచించి) సారఙా! నీవుయోచించి ప్రత్యుత్తర మియ్యలేదుసుమా!

సారం:—నాథా! ఇప్పటిస్థితి మహాకఠినమైనదని నే నెఱుఁగుదును. మన సైనికుల రుధిరమ్మును నీరమ్మువలెఁబాఱఁజేయ వలసివచ్చును. మనరక్తమును బ్రవహింపఁ జేయవలయును. ఆత్మార్పకులగు మనభటులశిరముల నాశ్రిత జనావనమున నర్పించి తీరవలయును. చేంబల్ నదీ తీరమున శవములచే ఘట్టము నిర్మింపకతప్పదు. ఎంతకాలమువఱకానదీజలములు పాఱుచుండునో, యంతకాలమువఱకు బుందేలు స్వార్థత్యాగుల రక్త మరుణకాంతులతోఁ బ్రకాశించుచుండుననియు, బుందేలుఖండవాసుల సంతానములలో నొక్కఁడేనియు జీవించియుండు వఱకు కీర్తిమాతని ఫాలదేశమునఁ గేసరితిలకమై మెఱయుననియు, జ్ఞప్తియందుంచుకొనుఁడు.

ఆకాశమున మేఘమూపక సముద్ర ముత్తుంగ తరంగములచేఁ నొప్పుచుండెను. అట్టి తరుణమున

"జీరజ్" దుర్గమునుండి రణరంగమునఁ దమశిరముల బలి పెట్ట నుద్యుక్తులైయున్న బుంధేలు పరాక్రమశీలుర ప్రబల సైన్యము బయలువెడలి చేంబల్ నదిదెస సాగి నడిచెను. ప్రతిభటుఁడును మూర్తీభవించిన వీరరసమువలెనుండె. అత్తఱి సారంధా, సమరావని కేఁగుచున్న తనకుమార ద్వయమును కౌఁగిలించుకొని నాథునకు విడె మొసంగి "బుంధేలుల మానము మీచేతనున్నది. పరమేశ్వరుఁడు మీఖడ్గముల నింద్రునివజ్రాయుధములుగఁ జేయుగాత" మని దీవెన లిచ్చిపంపెను.

మన వీరనారీమణి యీసందర్భమున నమితో త్సాహభరిత హృదయయై యానందసాగరమున నోల లాడుచుండెను.

---

## చతుర్థ రంగము

ఎడారియందు దాహాతిశయముచేఁ గంఠగతప్రాణుఁ డగు పాంథుఁడు దూరమున సతీరతరుప్రచ్ఛాయ జలా శయము (oases) దృగ్గోచరమైనంతనే యానంద పరవశ మున మైమఱచునట్లు, బుంధేలు సైనికుల యౌత్సుక్యముం జూచిన చక్రవర్తి తనూభవుల సంతోషమునకు మేరలేక పోయెను. చంపత్ రాయఁడా ప్రాంతములను జక్కఁగా నెఱింగిన వాఁడగుటచే రహస్యస్థలముల డాఁగియుండఁ

దనపరివారమునకు సన్న జేసి, చక్రవర్తి పుత్రులవెంట వచ్చి యధైర్యముచేత యథాయస్తలై యుండిన సేనలం బోరి కాందుర్తిపఱచి నది కొముత్తపుపొంతగునం బశ్చిమదిశాభిముఖుఁడై నడిచెను. నదికవతలిగట్టుననున్న దారా ప్రతిపక్ష సైన్యములు వేఱొక రేవున నదినిదాటనుంకించుచున్నవని యూహించి, తత్క్షణమే తన సేనలనుసైతము మాదెస కే నడువ సాగెను. అట్టి యదనుకనై వేచియుండిన బుందేలులు తోడనే తమ గుప్తస్థానములనుండి వెలువడి, యత్యాతురులై నదిలోనికి దిగిరి. చంపతరాయుం డనంతరము దారాను మఱపించుచుం దన సేనలం బొఱునైపులం ద్రిప్పి, బుందేలుల మార్గముననుసరించి సేనతో రేవుదాటెను. ఇదియంతయు జరుగుట కేమగంటలకాలము మాత్రమే పట్టెను. కాని రేవుదాటి చూచునఱకు బుందేలు స్వామిభక్తుల శవము లేమవంద లచ్చటం గుప్పలుగం గూలి యుండెను.

రాజునుజూచినతోడనే, బుందేలు సైన్యములకుం గలిగిన ధైర్య మింతయని చెప్పనలనుపడదు. వారంతట 'అల్లాహు అక్బ'రను రణనినాదముతో విజృంభించుచుండిన మొహియుద్దీనుని సిపాయిలతోడంగూడి, ఘోరున వీచుచు సముద్రము నల్లకల్లోలముసేయు తుపానువిధ

మునఁ జక్రవర్తిసేనలఁ జెల్లాచెదరుగఁ జేసెరి. అంతకు మున్నె బుంధేలు వీరులవలన గాసి చెందియుండిన యవన సేన, ఈక్రొత్తదాడివలన మఱింత డీలువడెను. ముష్టా ముష్టియుద్ధ మారంభమయ్యె. కరవాలములు తమతమ యొఱలలోనుండి బయట దుముకసాగెను. ఎల్లెడలరక్తము కాలువలై పాఱఁజొచ్చెను. అంతసూర్యుఁడును నీఘోర రంగమును జూడఁజాలకేమో యనఁ బశ్చిమాంబుధి మునిఁగెను. ఆకసము సంధ్యారాగముచేతను, భూమి రక్తపాతముచేతను, నెఱ్ఱవారెను. చిమ్మచీకటులు గ్రమ్మ నారంభింపఁగానే ఖడ్గములుగూడ విశ్రాంతి నపేక్షింప సాగెను. అంతలోఁ బశ్చిమదిఙ్మండలమునుండి మఱియొక దళము లోచన గోచరమై చూచుచుండఁగనే చక్రవర్తి సేనలవెన్నంటి నిరుపమానయుద్ధనైపుణ్యముతో వాని పైకెగఁబడి తత్సైనికుల యడుగులఁ జెదరఁగొట్టెను. చూపరులు "ఈ క్రొత్తసైన్యమెచ్చటిదో"యని యాశ్చ ర్యచకితులై చూడసాగిరి. భక్తివిశ్వాసములుగలవారు కొందఱు విపత్సమయమునఁ జక్రవర్తి సుతులకు సాయ పడవచ్చిన దేవదూతలే వీరని భావించిరి. చంపత్ రాయఁడీ సేనోదంత మెఱుంగఁగోరి సమీపించు వఱకుఁ గ్రొత్తదళమున కధినాయకుఁ డశ్వమును దిగి

రాజు నెదుట స్వతంత్రతఁ దెలపఁజెను. ఇంతకు ముం దద్భుతముగ వీరవిహారము సల్పినది తన సారంధ్రయే యని తెలిసినప్పుడు రాజున కెంత యుత్సాహముగను, గర్వముగను, నుండెనో యూహించుకొను భారము మానవులదే యైయున్నది.

సమరాంగణ మప్పు డద్భుతాకారముఁ దాల్చి యుండెను. ఏతావునఁ గొన్ని గంటలకుముందు భట సమూహములుండెనో, యాతావున నిప్పుడు శవములు తప్పమఱేవియు నగపడవు! అక్కటా! సృష్ట్యాదినుండి మానవుఁడెన్ని ప్రాణముల నెంత నిర్దయతోఁ దీసి యున్నాఁడో వాని లెక్కింప నేరి తరమగును?

అంత, విజయాలంకృతసేనలు ప్రతిపక్షసైనికుల వస్తువాహనముల లాగికొనసాగెను. ఇంతకుఁబూర్వము సజీవులు సజీవులతోఁ బోరాడుచుండిరి; ఇప్పుడో జీవవంతులు మృతకళేబరములతోఁ బోరాటము సల్పుచున్నారు! ఇంతకుమున్నగపడినది పౌరుషప్రదర్శకరంగము; ఇప్పు డది యాశాపరాయణత్వమునై విషాదకరమగు దృశ్యముగ మాఱెను! ఇంతకు మునుపు మనుష్యుఁడు పశుత్వము నవలంబించియుండిన నిప్పుడాతఁడా పశుత్వమునుండి పిశాచదశకుదిగెను.

ఈపెనఁగులాటలో, చక్రవర్తిసేనాధిపతియగు వలీబహాద్దరు ఖానునిశరీర ముండి లేని ప్రాణములతో మంటియందుఁబడియుండెను. ఆతని గుఱ్ఱము యజమానుని చెంగట నిలచి యీఁగలఁ బాఱఁదోలు చుండెను.

అట్టి స్థితియందు, గుఱ్ఱములపై నమితప్రేమఁగల చంపత్ రాయని మనము నావారువ మాకర్షించెను. అది యొక మేలుజాతిది. పోతపోసినట్లా యనునట్లుండిన యవయవముల సంపూర్ణాకృతియుఁ బులివంటి నడుమును జిరుతపులింబోలు నడుమును సొగసైనకర్ణవయుఁ గలిగిన యాయశ్వమును, యజమానునియెడ దాని విశ్వాసమును, గన్గొని జనులచ్చెరువు నొందసాగిరి. దానింజూచి రాజు "జాగ్రత్త! ఆగుఱ్ఱము నాయుధములతో నంట వలదు! దానినట్లే పట్టితెండు. అది నా లాయము నలంకరింపఁగలదు. దాని నాకడకుఁ దెచ్చియిచ్చువాఁడు బహుమానము వడయుదు"రని యాజ్ఞాపించెను.

అనుభవశాలురగు నాయాశ్వికులు నలుదిక్కుల నుండి దానిని సమీపించిరి. కొందఱు వలలువేసియు మఱి కొంద ఱితరోపాయము లొనర్చియు దానింబట్ట దమ యుక్తిశక్తులను ధారవోసిరి. కాని వారికోరిక నెఱవేఱలేదు. నిమిషకాలమున సైనికనికాయమెంతయో దానిచుట్టును

మూరగెను. సారంధాయును తన గుడారము వెలువడి నిర్భయముగ నాయుత్తమాశ్వము కడ కేగి మంత్రప్రభావముచేతఁ బోలెఁ దలవంచి నిలచిన యద్దాని మెడపై చేయివైచి వీపుదువ్వసాగెను. స్వామిభక్తి తత్పరమగు నాయశ్వము నిరాశ నూపు నట్లామె చెరఁగుచాటున మోముదాచికొని, మేకపిల్లవలె మచ్చికగా [illegible]బడి కన్నీరు గార్పసాగెను. రాణియుఁ దనకన్ను శిక్షకుల వలె దాని యగ్రపురులఁదుడిచి జూలుపట్టి తన గుడారమునకుఁ దీసికొని వచ్చెను. అశ్వముగూడ ప్రాతచుట్టమువలె నామెవెంట నడిచెను. దయాగుణముయొక్క [illegible] ప్రభావమును జూచినవారందఱు నాశ్చర్యము [illegible]రని వేఱుగఁ జెప్పవలయునా ?

తక్కిన వారియెడవలెనే గుఱ్ఱముయెడఁగూడ నిరాకరణభావమును జూపిన నెంతబాగ[illegible]యుండెడిది! సుందరశరీరముగల యీజంతు వీరాజవంశము పాలిటికి కంటకముంచు, రామాయణమునందలి స్వర్ణమృగముగఁ బరిణమించుట మాచదువరులు చూడఁగలరు.

---

## పంచమ రంగము

ప్రపంచమొక యుద్ధరంగము. ఏసేనాని దృష్టులు ప్రసంగావధానము కలిగియుండునో, యాతఁడే యీ

రంగమున విజయము నొందును. అట్టివాఁడెంత ధైర్యో
త్సాహములతో ముందడుగిడునో, విపత్సమయమున
నంతే తాలిమితో వెనుకకుఁ దగ్గనేర్చియుండును. అట్టి
వీరుఁడు రాజ్యముల స్థాపించును. రాష్ట్రముల నిర్మిం
చును. ఇతిహాసమాతని పేరఁ బూలపూజ యొనర్చు
చుండును.

అయినను, నీరంగమునఁ గొన్ని వేళల, సమయో
చితముగ ముందంజవేయ బాగుగనేర్చినను నుపద్రవ
సమయమున వెనుకకు మరలుట నెఱుఁగని సేనానులు
సైతము వచ్చుచుందురు. ఇట్టివారు నీతిసిద్ధాంతములను
పాలించుటకొఱకు విజయలక్ష్మిని నిర్లక్ష్యభావముతోఁ
దిలకించెదరు. ఈ పద్ధతిగల సేనాని సమరావని నొక్క
మారడుగిడెనేని తన సైన్యమంతయు రూపుమాసిపోయి
నను సరే వెనుకకు మాత్రమెన్నఁడును తగ్గఁడు. సమ
యోచితజ్ఞానహీనుఁడగు నీసిపాయికిఁ బ్రాపంచిక విజయ
మెప్పుడో యొకమారు తప్ప సామాన్యముగ లభింపదు.
అయినను నట్టిశూరుని పరాజయము సైతము పలు
మారు విజయముకన్న నెక్కువ కీర్తిప్రదమైయుండును.
సమయోచితజ్ఞుఁడగు సేనాపతి రాజ్యములను స్థాపించి
రాష్ట్రముల నిర్మించినచో, నాత్మగౌరవరక్షణార్థమై ప్రా

ణములఁ దృణీకరించు నీసేనాని - వెనుకంజవేయుట కలనైన నెఱుఁగని నీపీరావతంసుఁడు-రాష్ట్రముల నీతివర్తనమును సంస్కరించును. వారి హృదయఫలకముల పైన నీతియొక్క ప్రాముఖ్యమును శిలాక్షరములనువలెఁ జెక్కును. ప్రాపంచిక విజయమున నాతఁడు వన్నెకు రాకున్నను, ఏసైనసభయందుఁగాని, యుపన్యాసమునందుఁగాని, యాపురుషుని నామోచ్చారణమయ్యేనేని, తోడనే సభ్యులంద ఱేకగ్రీవముగా నాతనిస్తుతించి కరతాళ ధ్వనులఁజేయుదురు. సృష్ట్యంతమువఱకును నాతని పవిత్రనామము చుట్టును, ఆధ్యాత్మికగౌరవరూపక తేజః పరివేషముస్థిరముగ నేర్పడియుండును. మన కథానాయిక యగు సారంధ్రాసహితము స్వగౌరవమునకై ప్రాణము లర్పించు నట్టి సేనానులలోఁ జేరినదే!

చక్రవర్తిపుత్రుఁడగు మొహియుద్దీన్ చేంబల్ నదీ తీరమునుండి, ఆగ్రాపురోన్ముఖుఁడై పోవునప్పుడు భాగ్యదేవత తన చల్లని నీడనాతనిపైఁబడనైచుచుండెను. విజయలక్ష్మి దృగంచలముల నాతని జూచుచు వరింప సిద్ధపడియుండె. కావున నాగ్రాపుర ప్రవేశమైనతోడనే, సార్వభౌమిక సింహాసన మాతనికిఁ దన్నర్పించుకొనెను.

సింహాసనము నధిష్ఠించిన వెంటనే, అప్పరంగ జేబు, సార్వభౌమిక సైన్యపు సరదారుల తప్పులమన్నించి వారిమన్నబుల నెప్పటివలెనే నిల్పియుంచెను. రాజా చంపత్ రాయఁడు తన కొనర్చిన స్వార్థరహితమగు నుపకారమునకుఁ బ్రతిఫలముగ బారాహజారి (పంద్రెండు వేలు) నాయకత్వోద్యోగము నిచ్చియు, ఓర్ఛానుండి కాశీవఱకును నచ్చటినుండి యమునానదివఱకును జాగీరొసంగియు, సన్మానించెను. బుందేలు రాజసింహము మరల ఢిల్లీ సింహాసనపుమాండలికత్వమును తలధరించెను. మరల నొకమారు విలాసప్రధానములగు విందులును, సభలును సమావేశము కాసాగెను. మరల సంగీత వాద్యశ్రవణసుఖాదులు తాండవ మాడఁజొచ్చెను. మరల సారంధా మనఃపద్మము విచారతమముచే ముకుళించెను.

వలీబహద్దర్ ఖానుని వాగ్వైచిత్ర్య మనతికాలముననే యాలమ్గీరు చక్రవర్తి హృదయమునఁ దనకాశ్రయము సంపాదించుకొనఁగల్గెను. చక్రవర్తి యాతనిపైఁ దన కృపాదృష్టులఁ బఱపసాగెను. కాని తక్కిన విషయములకన్న తాఁగోల్పోయిన గుఱ్ఱము సంగతి మాటిమాటి కాతని మనమ్మును వేధించుచుండెను. ఒకనాఁడు

రాజకుమారుఁడగు ఛత్రపాలుఁ డాయశ్వమునే యధి ష్ఠించి విహారమునకై బయటికేఁగి మార్గవశమున ఖాను గృహమును సమీపించుట సంభవించెను. సమయ మునకై యెదురు చూచుచుండిన యాఖానుఁడు తన సేవకులకు సన్న చేసెను. వారు గుఱ్ఱము నపహరిం చిరి. రాజపుత్రుఁడొంటరి వాఁడగుటచే వారి నెది రింపఁజాలక, నడిచి గృహమునకేతెంచి, సారం ధాకో నాయుదంతమునంతయు విన్నవించెను. ఈ వార్తవిన్నతోడనే రాణీరోషారుణితలోచనయై "గుఱ్ఱ ముపోయినదను విచారము నాకు లేదు. కాని దాని వదలివచ్చిన నిన్నుఁజూచిన దుఃఖము వ్రేడముచున్నది. నీశరీరమున బుందేలులకు సహజమగు వీరరక్తము ప్రవ హించుచుండలేదా ? గుఱ్ఱము నీకు లభింపకపోయిన మానె. ఒక బుందేలుబాలుని నుండి యాతని యశ్వము నూడఁదీసికొనుట నవ్వులాట కాదనియైన భవత్కార వాలబలమున నీవు చూపవలసియుంటి"వని విషాదము గదురఁబల్కెను.

పైవాక్యములతో నామె శౌర్యధనులగు దన యిరువదియైదుగుర సిపాయిలను సమరోద్యుక్తులుగా నియమించి తానును బురుషవేషమున వారి నాయకత్వ

మును వహించి, ఖానునియింటికిఁ బోఁబు విచారింప నతఁ డావారువమునే యెక్కి దర్బారున కరిగియుండెను. సారం ధా తత్క్షణమె విద్యుద్వేగమున దర్బారున కేఁగుచుఁ బోయిచేరెను. సభాసీనులందఱును ఈ వార్త నెఱిఁగి కళవళము నొందసాగిరి. రాజసేవకు లామూలనుండి యీమూలకును సీమూలనుండి యామూలకును బఱు విడి కూడిరి. ఆలమ్గీరు సైతము తన పీఠమునుండి లేచి సభాంగణమునకు వచ్చెను. సరదారులందఱు నాయుధ పాణులై లేచి యుద్ధసన్నద్ధులైరి. నలుదిక్కులఁ గోలా హల మారంభమయ్యెను. మున్నొకమా రాసభయందే యమరసింహుని దారుణ కృపాణకాంతుల నవలోకించి యుండిన యనేకుల దృష్టియెదుట నప్పటిరంగము మరల మూర్తీభవించెను. అంతట సారంధా యెలుఁగెత్తి ఖాను నితో "ఖానుగారూ! చేంబల్ నదీ తీరమునఁ జూపవలసి యుండిన శౌర్యమును మీరు నేఁడొక బాలునియెడఁ జూపి యుండుట యెంతయు లజ్జాకరము. బాలునినుండి యశ్వ మును లాగికొనుట మీకు న్యాయముగనే తోఁచినదా?" యని యడిగెను.

కన్నుల నిప్పులు వెదజల్లుచు ఖానుఁడు కఠినముగఁ బలికెను. "నావస్తువును దమస్వాధీనము చేసికొనుట కితరుల కెట్లధికారము గలదు?"

రాణి:—రణభూమియందు నాకు దొరకిన యీవస్తువు నాదికాక మీ దెట్లగును? నా వస్తువును మీరింత సులభముగ లాగికొనఁజాలరని దృఢముగఁ జెప్పుచున్నాను. దానికొఱకు నే నొక సహస్ర సైనికుల రక్తపాతమునకు సిద్ధపడి యున్నానని యెఱుంగుఁడు!

ఖాను:—ఈ గుఱ్ఱమునకు మారుగ నాలాయములోని యశ్వముల నన్నిఁటిని నదలుకొనెదను గాని దీనిని మాత్రమియ్యను.

రాణి:—నేను నాగుఱ్ఱమును దీసికొనక మానను!

ఖాను:—దానియెత్తు స్వర్ణరత్నాదులనైన నిచ్చెదను గాని దాని నియ్యను.

రాణి:—అట్లయిన నావిషయమును ఖడ్గములు తీర్మానించుఁగాక!

అంత బుంధేలు సర్దారు లొఱలనుండి కరవాలముల దూసిరి. కొంచెము సేపటిలో నాసభాంగణము రణాంగణముగ మాఱియేయుండును గాని యంతలో, ఆలమ్గీరడ్డమువచ్చి "రాణీగారూ! మీభటులవారింపుఁడు. గుఱ్ఱమును మీకిప్పించెదను. కాని దానివెల మాత్రము చాల హెచ్చగు"నని.

రాణి:—దానికై నేను నాసర్వమును గోల్పోవసిద్ధముగ నున్నాను.

ఆలం:—జాగీరు మన్నబులుగూడనా ?

రాణి:—జాగీరుమన్నబులు నాకొక లెక్కయా ?

ఆలం:—మీరాజ్యముకూడ నంకేయగునా ?

రాణి:—అదియు నాకుఁ దృణప్రాయము.

ఆలం:—ఇంతటి త్యాగమొక్క గుట్టము కొఱకుగా !

రాణి:—అయ్యో ! గుట్టము కొఱకుగాదు. ప్రపంచమందలి పదార్థముల నన్నిటిలోఁ బ్రియతమ మగునదేదియో దానికొఱకు.

ఆలం:—అదేది ?

రాణి:—ఆత్మగౌరవము.

ఈవిధముగ రాణీ సారంధా యొక గుట్టము కొఱకుఁ దన విశాలమగు జాగీరును గొప్ప మనసబును, చక్రవర్తికిఁ దమయెడఁగల గౌరమునుద్యజించెను ! ఇంతియకాక, సార్వభౌముని యాగ్రహమునకుఁగూడఁ బాత్రురాలయ్యె. ఆ నిముసమునుండి యామరణాంతమును, చంపత్ రాయఁడు మనశ్శాంతి ననుభవింపలేదు.

## షష్ఠము రంగము

చంపత్ రాయఁడు మరల జీరజ్ దుర్గమున నివాసముండెను. మన్నబు జాగీరులను గోల్పోవుట యాతనికి వ్యసనము గలిగించెనుగాని, భార్యస్వభావమును బూర్తిగ నెఱింగినవాఁడగుటచేఁ దనవ్యాకులతను బయటికిఁదోఁపనియ్యఁడయ్యె. కొంతకాలమిట్లు సుఖముగనే కడచెను. ఆనాఁటి సారంధాకఠిన వచనముల నాలమ్గీరు మఱచియుండలేదు. కనుక సోదరులతోఁ గలిగిన వ్యవహారములనుండి తీఱికయైనపోఁడనే యాతఁడొక ప్రబలసైన్యమును చంపత్ రాయనిశిక్షింపఁ బంపెను. సమరానుభవముగల యిరువదియిద్దఱుసరదారు లీదండయాత్రకై నియోగింపఁబడిరి. చంపత్ రాయని పిన్ననాఁటి క్రీడాసఖుఁడును బాల్యస్నేహితుఁడును నగు 'శుభకర్ణుఁ'డను బుందేలుఁడు చక్రవర్తిసేనకు సుబేదారుగనుండి రాయని సాధింప బద్ధకంకణుఁడయ్యెను! ఇంకను ననేకులు బుందేలు సరదారులు, తమరాజు పక్షమునువదలి చక్రవర్తి సేనాధిపతితోఁ జేరిరి. పోరు మహాఘోరమయ్యె. సార్వభౌముని క్రీఁగంటి చూపులయాశ సోదరులను సోదరుల రక్తమునకుఁ బిపాసాతురులఁ జేసెను. ఈ యుద్ధమున రాజునకే జయముగలిగినను నతనిబలము పూ

ర్తికిఁగొఱవడెను. అతని రాజ్యమునకుఁ జుట్టుపట్టులనున్న బుందేలు సంస్థానికులు చక్రవర్తి యనుగ్రహమునకుఁ దమ కర్తవ్యధర్మము నమ్ముకొనిరి. ప్రాణమిత్రులలో గొంద ఱక్కఱకువచ్చిరి. కొందఱు వంచించిరి. బంధువులు మొగములఁ దప్పింపసాగిరి. ఇన్ని యిక్కట్టులు ప్రాప్తించినను చంపత్ రాయఁడు ధైర్యమువదలినవాఁడు గాఁడు. జీరజ్ దుర్గమును వదలి మూఁడు సంవత్సరముల వఱకాఁతడు పర్వతారణ్యముల నిల్లుగఁ జేసికొనెను. వేటమృగములవలె దేశమందంతటను సంచరించుచుండు. చక్రవర్తిసేనలలో నేదైననొకదాని ననుదిన మెదుర్కొనవలసి వచ్చుచుండెడిది. సర్వకాల సర్వావస్థలయందును రాణిభర్తకుఁ దోడునీడయై ధైర్యమిచ్చుచుండెను. ఓర్పునొక మూలకుఁబోఁద్రోలి, యాశనడవిపాలుచేయు నంత భయంకర సమరసమయము లందును, నాత్మగౌరవ రక్షణోద్యోగ మాతని మనోదృష్టిమెదుట మూర్తీభవించి యుండెడిది. ఒక సంవత్సరమువఱ కీవిధముగ జరిగిన పిదపఁ జక్రవర్తి సేనాపతులు విసికి 'ఈపులిని వేటాడుటకు దేవరకుఁ దప్ప వేఱొకరికి సాధ్యముకా'దని విన్నపమంపుకొనిరి. దానికుత్తరముగ 'ముట్టడులనాపి, సేనల మరలించుకొని రం' డనునాజ్ఞాపత్రము వచ్చెను.

'ఈయులజడి దప్పిన దింతేచాలు' ననుకొని రాయఁడు ఓర్ఛాదుర్గమునకు వచ్చి నివసించెను. కాని దట్టమగు మబ్బునుండి కొంచెము సేపుబయటఁబడి ప్రకాశించినను మరల మేఘాచ్ఛాదితుఁడగు భాస్కరునివలెనే కొన్ని మాసముల శాంత జీవనము తరువాత రాయభాస్కరుఁడు మరల వనవాసముపాలు గావలసివచ్చెను.

---

## సప్తమ రంగము

మూఁడువారములనుండి చక్రవర్తిసేనలు, ఓర్ఛాదుర్గమును ముట్టడించి యున్నవి. హృదయములను భేదించు కఠినవాక్యములవలె ఫిరంగిగుండ్లు ప్రహారీగోడలను భేదించుచున్నవి. కోటలోనుండిన యిరువదివేల జనులలో సగముకన్న నెక్కుడుగ స్త్రీలును, దాదాపుగా నంతమందియె బాలురును నున్నారు. పురుషుల సంఖ్య దినదినమునకును దగ్గుచున్నది. గాలియైన లోనికిఁ జొరకుండ నలుదెసల మార్గము లరికట్టఁబడినవి. భోజన సామగ్రు లత్యల్పములుగ శేషించియున్నవి. భర్తల యొక్కయు బిడ్డలయొక్కయుఁ బ్రాణములుఁ గాపాడుట కొఱకు స్త్రీ లుపవాసవ్రతములఁ గడపుచున్నారు. 'కొలఁదిదినములలోనే యందఱమును నిరాహారులమై

మడియవలసియుండు' నను నిశ్చయము వారి నందఱను గంతగతప్రాణులఁ జేసినది. స్త్రీలు సూర్యునిదిక్కు చేతు లెత్తి శత్రుసేనల శపించుచున్నారు. బాలురు కోపావేశ పరవశులై తమ చిన్ని చేతులలో శత్రుసేనలపైకి విసరి వైచుచుండిన రాళ్లు కోటగోడల వఱకైనను బోవుచుం డుటలేదు. దురదృష్టవశమున చంపత్‌రాయఁడుకూడ జ్వరబాధచేఁ గడు డస్సి మంచమువట్టి యున్నాఁడు. అప్పుడప్పు డాయనను జూచుటవలన నించుక యూఱట గలుగుచుండినను కోటలోనివారందఱు సంక్షోభమగ్న మానసులై యుండిరి.

ఇట్టితరుణమున, రాజు సారంథాతో "సారన్! శత్రువులు నేఁడు తప్పక గోటలోఁ బ్రవేశించెదరని తోఁచెడి" నని పలికెను.

సారం:—అట్టిదినము జూచుఁ దౌర్భాగ్యము నీ కన్నులకు దేవుఁడు గలుగఁజేయకుండుఁ గాక!

రాజు:—మన యవస్థ కేమి గాని 'మనతోఁబాటీ నిర్దోషులుగూడ నిడుమల గుడుచుచున్నారు కదా' యని తలంచినపుడు మనస్సున కగు నెవ్వగ యిట్టి దని చెప్పఁజాలను.

సారం:—మన మిక్కడనుండి వెడలిపోయినచో—

రాజు:—ఈ నిస్సహాయులను వదలిపెట్టియా ?

సారం:—వారనుభవించుచున్న యాపదలకు మనమే కదా కారకులము. కనుక మనమొకవేళ వెడలి పోయినచో శత్రువులు వీరియెడ కనికరముం జూపవచ్చును.

రాజు:—నేను వారిని విడువంజాలను. ఏపురుషులు మనకొఱకుం దమ యసువుల బలియిడిరో వారి భార్యాపుత్రుల నిట్టి స్థితియందు వదలిపోవ నొల్లను.

సారం:—మన మిచ్చటనుండి మాత్రము వారికేమి సహాయము చేయుచున్నాము ?

రాజు:—చేయకపోయినను వారితోంగూడం జచ్చుట కైన వీలుకలదుగదా! వారి రక్షణోద్యమమున నేను ప్రాణములం బాసెదను; వారికొఱకుం జక్రవర్తి సైన్యముల వేడుకొనెదను. చెఱసాల దుఃఖముల ననుభవించెదను. కాని వారిని విడువను.

సారంధా వెలవెలంబారిన తన ముఖమునువంచుకొని తనలో 'నిజముగనే చిరమిత్రులగు వీరిని శత్రు సైన్యముల కోపాగ్నికి బాసటం జేసి మన ప్రాణములం గాపాడుకొనుటయేటి శౌర్యము ? నాకిట్టి స్వార్థపరాయ

ణత్వపు టుద్దేశమేల కలిగెను? నాథునిపరాధీన దైన్య మునుండి కాపాడవలయునను గాటమగుతలంపు మానవ కర్తవ్యభావము నడచి వైచినదికదా' యని తలంచి మరల భర్తతో "ఒకవేళ శత్రుసేనలు వీరిని బాధింప వను నిశ్చయమువిూకుఁగలిగినచో నావేడికోలు నంగీక రింతురా?" యని యడిగెను.

రాజు:—అట్టి నిశ్చయముఁ గలిగించు వారెవరు?

సారం:—చక్రవర్తియొక్క సేనాధిపతి వ్రాత.

రాజు:—ఆ! అట్లయిన నొప్పుకొనెదను. కాని యింకొక సంగతి. వీరందఱు సంతోషపూర్వకముగ నన్ను వీడుకొల్పవలయును.

సారంధా కొంచెముసేపు విచారసాగర మున మునింగి యుండెను. "సేనాధిపతితో నిట్టి యొడంబడిక చేసికొనుటెట్లు? సందేశమును దీసికొని పోవు వారెవరు? ముష్కరులగు నాశాత్రవు లిట్టినియ మమున కెట్లులోబడుదురు? రెండుమూఁడు దినములలో జయమబ్బునను నమ్మకముగల శత్రుసేనలు సంధికెట్లం గీకరించును? వాక్చమత్కృతిచేతను వ్యవహారనైపుణి చేతను నీపనిని నెరవేర్పయోగ్యుఁడగు వాఁడెవ్వఁడు గలఁడు? ఛత్రసాలునిచేత నీకార్యము నెఱవేరునా?"

యను తలంపు లామె మనస్సు ననేకమారులు బాధించి తుదకు ఛత్రసాలుని బిలువనంపఁ జేసెను. ఈ ఛత్రసాలుఁడు రాణి యొక్క సుతచతుష్టయమున, తక్కిన వారికన్న నెక్కువ ధీమంతుఁడును వచోమాధుర్యముగల వాఁడును నై యుండినందున తల్లి కీతనియం దెక్కువ మక్కువ గలిగియుండెను. ఛత్రసాలుఁడువచ్చి తల్లికిఁ బ్రణామము లొనర్పఁగానే, రాణి కనుదమ్ముల నశ్రు వులునిండి హృదయమునుండి యొక దీర్ఘనిశ్వాసము వెలువడెను.

ఛత్ర:—అమ్మా! నాకేమి యాజ్ఞ?

రాణి:—ఈనాఁటి యుద్ధవార్తలేమి?

ఛత్ర:—మనభటు లేఁబదిమంది యిదివఱకు మడసిరి.

రాణి:—హా! పరమేశ్వరా! బుంధేలుల మానములఁ గాపాడు భారమిఁక నీదే?

ఛత్ర:—నేఁడు రాత్రివేళఁగూడ యుద్ధముచేయ నుంకించుచున్నాము.

అంతరాణి తన యుద్దేశమును నాల్గుమాటలతో నాతనికిఁ దెల్పి "ఈ కార్యమున కెవరిని నియోగించిన బాగు" అని ప్రశ్నించెను.

ఛత్ర:—నన్ను నియోగింపుము.

రాణి:—నిన్నా ! నీవీకార్యము నెఱవేర్పఁగలవా ?

ఛత్ర:— నాకు నాశక్తిని గూర్చి యట్టి నమ్మకము గలదు.

ఛత్రసాలుఁడా సందేశమును గొని వెడలి పోవునప్పుడు తల్లి తన తనూజుని గౌఁగిలించుకొని "ఈశ్వరుఁడు నీమోమును ద్వరఁగాఁజూచు భాగ్యము నాకుఁగలుగఁ జేయుగాక"మని దీవించి కొంత సేపటివఱకుఁ గన్నీరు మున్నీరుగ నేడ్చెను. పిమ్మట నాకసమువంకఁ దనకర పల్లవములనెత్తి "దేవా! యశఃకాముఁడును వీరశిరోమణియు నగు నా నవయౌవన పుత్రుని బుంధేలుల మానరక్షణమునకై నీకర్పించితిని. నీవుగాక మాగౌరవము నిలువఁబెట్టువారు మరెవ్వరుగలరు? కరుణతో నామొసఁగిన యీ యమూల్యార్పణము నంగీకరింపుము" అని వేఁడెను.

---

## అష్టమ రంగము

మరుచటిదిన ముదయమున, రాణి స్నానముచేసి, పళ్లెరమునఁ బూజాద్రవ్యముల నిడుకొని దేవాలయమునకుఁ బోవునప్పు డామెముఖము పచ్చఁబారియుండెను. కన్నులఁ జీకటులు గ్రమ్మెను. నిద్రాదేవియొక్క సన్నాహ

నాస్త్రప్రభావము విచారగ్రస్తులగు వారియెడఁ బని చేయదుకదా! అట్లామె దేవతామందిర ద్వారమును జేరువఱకామె చేతనున్న పళ్లెరమున, మొనకుఁ గాగితము చుట్టఁబడియుండిన బాణమొకటి వచ్చిపడెను. రాణిపళ్లెరము నాలయపు టరుగుమీఁద నునిచి కాగితమును దీసి చదువునప్పు డామెమోముఁదమ్మి వికసితమై కన్పట్టెను. కాని యావికాసము చాలసేపు నిలచినది కాదు. "అక్కటా! ఈ కాగితమునకై నవయావనుఁ డగుబిడ్డ నొకనిని బోఁగొట్టుకొంటినిగదా! కాగితపు ముక్కకొఱ కింతవెల నిచ్చినవా రీప్రపంచమున నెవరైననుందురే?" యనుమాట లామె పెదవులనుండి వెడలెను.

సారంధ్రా దేవళమునుండి మరలి వచ్చినతోడనే సేనాధునికడ కరిగి "మనోనాథా! మీరు రాత్రి చేసియుండిన వాగ్దత్తము నిప్పుడు నెఱవేర్చవలయు" ననెను.

రాజు కలవరముతో మేల్కాని "నీవాగ్దత్తమును నీవు నెఱవేర్చితివా?" యని యడిగెను.

రాణి తానుదెచ్చిన కాగితమును రాజుచేతి కందియ్య నాతఁడు దానిఁ దుదివఱకుఁ జదువుకొని "సరి. ఇఁక నాకు మనవారినిఁగూర్చి చింతలేదు; పోవుదము.

ఈశ్వరానుగ్రహ ముండిన మరియొకమా కీశత్రుప్రుల రక్తముచే నా కరవాలపుడప్పి దీర్చెదను. కాని ప్రేయసీ! నిజముచెప్పుము. ఈయొడంబడిక కెంత వెలఁజెల్లించితివి?" యని ప్రశ్నించెను.

రాణి:— (యశ్రుపూరితనయనయై) చాల ప్రియ మైన వెల!

రాజు:—అదెంత?

రాణి:—సుకుమారుఁడగు నొక కుమారుఁడు--

రాజామాటవిని నిశ్చేష్టితుఁడై కొంతసేపటికి "ఏకుమారుఁడు? అంగదరాయఁడా?"

రాణి:—కాఁడు.

రాజు:—రత్నసాహుఁడా?

రాణి:—కాఁడు.

రాజు:—ఛత్రసాలుఁడా?

రాణి:—అవు నతఁడే—

ఈశబ్దమును విన్న చంపత్‌రాయఁడు, కంఠము నఱకఁబడిన పులుఁగుమాడ్కి, నొక్కమారు పై కెగసి మరల శయ్యపైఁ బడి మూర్ఛితుఁడయ్యె. ఛత్రసాలుఁ డాతనికిఁ గడు గారాబుకొడు కగుటయే కాక నాయన యాశలన్నియు నాతనియందే యుండెను. అఱగంట తరు

వార్తఁ దెలివివచ్చినపిమ్మట "సారఙ! నా కీమాట ముందుగానే తెలిసియుండినచో ఛత్రసాలుని గోల్పో యియుండను. ఛత్రసాలుఁడు మృత్యువువాతఁ బడియె నేని, బుంధేలువంశ జ్యోతి కొండ కెక్కెనుగదా!" యని పట్టరాని నెవ్వగతో దీనముగఁ బలికెను.

ఆరాత్రి కోటలోని వారికిఁ గడువిషాదముగఁ గడచెను. స్త్రీలందఱును రాణిపాదముల పైఁబడి "మమ్మెన్నటికిని మఱువవలదని వేడుకొనుచుండిరి." పురుషులు "పిన్ననాఁటనుండియు నీడవలె మీ వెంట నున్న మమ్మునిప్పుడు సైతము మీ వెనువెంటఁ గొని పొం"డని జాలిగదురఁ బలుకుచుండిరి. కోటయంతయు దుఃఖరూపమును దాల్చెను. సారంధా స్త్రీలనందఱను కౌఁగిలించుకొనెను. చంపత్ రాయఁడు పురుషులందఱ సెలవుఁగైకొని, సహస్రసంఖ్యాకులగు జనులు వియో గదుఃఖమున హాహాకారములు సేయుచుండఁ బల్లకి నెక్కెను. అచ్చటివారందఱి డెందములును 'మరల నీమ హాత్మునిజూచు నదృష్టమబ్బునా' యని సందియమున గొందలమందుచుండె. ఇదియే తుదిదర్శనమని వారికిఁ దోఁపసాగెను. అంతియకాని, పల్లకియే యాతని శవ వాహనమగునని యెవరు తలంపఁగల్గిరి!

కటికిచీకటులచే నిండియుండిన నాఁటిరాతిరి యాకాశమునమాత్ర మసంఖ్య నక్షత్ర రూపకదీపికలు వెలుఁగుచుండెను. కాని సమాధిదీపములవలె నవి కాంతి విహీనముగనుండెను. దుర్గమంతయు శ్మశాన వాటికఁబోలె రోదనధ్వానములతో నిండి వినువారి గుండెలఁ బగులఁ జేయఁజాలియుండె. అశ్రుమతి రాణి సైనిక వేషముధరించి యశ్వారూఢయై వెంటరాఁగా, పల్లకి సారంగము మార్గమున దుర్గమునుదాఁటెను.

అనేకసంవత్సరముల క్రింద నిట్లేభయంకరముగ నుండిన యొకరాతిరి మాచదువరుల స్మరణయందుండ వచ్చును. ఆరాత్రి సారంధామనస్సు ప్రేమామృతపు రుచినెఱింగి యుండలేదు. ఆసమయమున శీతలాదేవి చెప్పిన భవిష్యత్తిప్పుడు యథార్థమైనది కదా! అప్పుడు సారంధాయొసంగిన ప్రత్యుత్తర వాక్యములోని భవిష్యత్తునైత మిప్పుడు నిజమగునా ?

---

## నవమ రంగము

మధ్యందిన మార్తాండుఁడు కిరణవ్యాజమున నిప్పుకణముల వెదఁజల్లుచుండెను. తీక్ష్ణమై, శరీరముల దహింపఁజేయు వేడిగాడ్పు దావానలము చందమున

నరణ్యమును మండించుచు దిరుగుచుండెను. అగ్నిదే వుని సైన్యమంతయు విచ్చలవిడిగ విహరించుచున్నదో యనునట్లు తోఁచుచుండెను. భూమ్యాకాశమధ్య ప్రదేశము నుష్ణధూళి మేఘమువలెఁ గ్రమ్ముకొనెను. అట్టి వేళ సారంధా వారువము నెక్కి భర్తపల్లకిని వెంటఁగొని పశ్చిమ దిశోన్ముఖయై చనుచుండె. ఓర్ఛాదాటి పదిక్రోసులదూరమేఁగిన పిదప నిఁకభయము లేదని మనస్సునకు ధైర్యముదోఁప నారంభించెను. మూర్ఛానగుఁడైయుండిన రాజుపల్లకిని మోయుబోయలు మార్గాయాసముచేఁ గడుడస్సి చెమ్మటయందు మునింగి తేలిరి. వెంటవచ్చు నైదుగురాశ్వికులును, వీరదంపతులును, బోయలతోఁ బాటు దాహాతిశయముచేఁ దహాతహాలాడుచుండిరి. నీడనిచ్చువృక్షము కొఱకును, నీటినిచ్చు బావికొఱకును వారందఱు దృక్కులత్యాతురత తో వెదకుచుండెను.

అంతరాణి వెనుకకుమరలి చూచునప్పటికి అశ్వికదళమొకటి వచ్చుచుండెను. శాత్రువులు తమ్మువెంట నంటివచ్చుచున్నారనియు ముందేదో కీడుమూడ నున్నదనియు నామెకు భయముదోఁచెను. కాని తరువాత తన తనూజ లోకవేళ సహాయమునకై వచ్చుచున్నారేమో

యను నాశ కలుగసాగెను. నిరాశావశులై యున్నప్పుడు సైత మాశాంకురము లగపడుట మానవస్వభావమే కదా! ఇట్లు కొంచెము సేపటివఱకాశూరవనిత యొకప్పుడాశకును మరొకప్పుడు భీతికిని లోబడుచుండ, నంతలో నాయాశ్వికులు రాజు పరిజనమును సమీపించిరి. శత్రుసేనల రాకను జూచి రాణి దీర్ఘవిశ్వాసము వదలెను. అంత నావిదుషీమణి పల్లకి దింపుకొన బోయల కాజ్ఞాపించెను. వెంటనున్న బుంధేలు సిపాయిలుగూడ ఖడ్గహస్తులై సమరమున కాయత్తులైరి. దౌర్బల్యమువలనఁ దనయవస్థ కడు దుఃఖకరముగ నుండినను, బలమైనగాలి సోకఁగనే ప్రజ్వరిల్లు చిదుగులుగప్పిన నిప్పువలె, శత్రువుల యాగమనవార్త నెఱింగినతోడనే శరీరమునకు బలము హెచ్చ, రాజు పల్లకీఁదిగి బాణతూణీరములఁ గేలఁబూని వెలువడెను. ఒకప్పుడు పరసేనలకు యమసందేశముఁ బోలియుండిన యాశూరుని బాణ మిప్పుడు నిరర్థకమై వంగిపోయెను. తలవడఁకసాగె. నేల చదికిలఁబడియె. ఇఁక నదృష్టదినములు గడచిపోయినవను మనోనిశ్చయ మాతనికిఁ గలిగెను. సర్పమును జూడఁగనే యెగురనుంకించి మరల నేలగూలు రెక్కలులేని పక్షి విధమున చంపత్ రాయఁడు దనస్థానమునుండి లేచి

మరల క్రిందఁ బడెను. సారంధా భాష్పాకులితనేత్రయై "నాథా!" యని యొక్కమా రుచ్చరించి యూరకుం డెను. తరువాత నామె పెదవులనుండి మాట వెడల లేదు. ఇట్టి సమయములందు, మౌనము ఉపన్యాసము కన్న నెక్కువభావ బోధకమై యుండునుగదా! పాపము సారంధావంటి శూరవనిత సైత మాంతరుణమున స్త్రీ జన సహజమగు నబలాత్వమునకు లొంగిన ట్లగపడు చున్నది! అవును; కొంతవఱకు మార్దవము స్త్రీలకు భూషణాస్పదమే యనుటయం దెవరికాక్షేప ముండును? చంపత్ రాయఁడు భార్యనుజూచి "చూచితివా సారంధా! మనభటులలో మరియొకఁడుఁగూడ మృత్యుకరాళమునఁ బడెను. ఏ యవమానముఁ దప్పించుకొన నే నాజన్మము యత్నించుచుంటినో, యాయవమానమే అవసానసమ యమున నే ననుభవింపవలసి వచ్చెను! నా కట్టెదుటనే శత్రువులు నీ పవిత్రగాత్రము నంటుచుండ, నేనున్న తావునుండి కదలఁజాలని యవస్థయం దుండుట తటస్థిం చెను! అయ్యో! మృత్యుదేవతా! ఎన్నడు నా యవ మానమున కంతము కలిగింతువో కదా!" యని వగవ సాగెను.

ఈవాక్యములఁ బలుకువేళ నావీరపురుషున కొక సంగతి జ్ఞప్తికి వచ్చినందున దవ్వుననున్న ఖడ్గముపై కాతనిహస్త ముఱికెను. కాని కరముల బలహీనతను దలంచి యాప్రయత్నమును మానుకొని "సారఁగ! నీ వనేకమారులు నామానము గాపాడియుంటివి! జ్ఞాపక మున్నదా?" యని యడిగెను.

ప్రియుని వాక్కునుండి వెలువడిన యీమాటలు సారంధా మనోదౌర్బల్యమును బారఁదోలెను; అశ్రువు లారిపోయె; వాడియుండిన ముఖకమలముపై మరల నరుణకాంతి పొడచూపెను. "ఇంకను నేను నా మనోనాధునకు సాయముచేయఁగలనుగదా!"యనుభావ మామెను దుఃఖనిద్రనుండి మేలుకొల్పెను. అంత నామె భర్త దిక్కు మొగమై "ప్రాణేశ్వరా! ఈశ్వరుఁడు రక్షించిన జీవితాంతమువఱకును నట్లే కాపాడెద"నని ధైర్యముతోఁ జెప్పెను.

చంపత్:—నీవు నాకోరిక నెన్నడును వృధపుచ్చిన దానవు కావు.

సారం:—ప్రాణములు బొందిలో నుండునంతకాలము వృధపుచ్చను.

చంపత్:—ఇదియే నాతుదికోరిక యగునేమో! దీనిని తప్పక నెఱవేర్చవలయుఁ జుమా!

అగారము పాలుగాకుండ నాత్మహత్య చేసికొనఁ దన్నుఁ బ్రేరేపించుట భర్తయుద్దేశమై యుండునని తలఁచి సారంధా తనకరవాలము నెదకానించి "నాథా! ఇది తమకోరిక కాదు. తమపాదరాజీవములపైనఁ దలమోపి యసువులఁబాయుట నామనోభీష్టమని నమ్ముఁడు" అని నమ్మకముదోఁపఁ బలికెను.

చంపత్ :—నీవు నాయభిప్రాయమును గ్రహించియుండ లేదు. శృంఖలబద్ధములగు గాళులతో, ఢిల్లీపుర వీధులందు లజ్జాకరముగ దిరుగు మనియా నన్ను శత్రువుల కప్పగించి పోయెదవు?

సారంధా! ఆశ్చర్యమగ్న మానసయై, భర్త యుద్దేశము నెఱుంగఁ జాలక యామెనాథుని మోము వంకఁ దేఱిపాఱఁ జూచెను.

చంపత్ :— కోమలీ! నాకొకవరదాన మొసఁగఁ గలవా?

రాణి:—నిశ్చింతగా నడుగవచ్చును

చంపత్ :—ఇదినిన్ను వేడు నాతుది మనోరథముసుమా! నాచెప్పినయట్లు చేసెదవా?

రాణి:—నాథా! సందియమేల? తప్పకచేసెదను; సెలవిండు.

చంపత్:— మాటయిచ్చితివి. వెనుకకుఁ దిరుగఁ గూడదు.

రాణి:—(వడఁకుచు) సెలవిండు—

చంపత్:—నీఖడ్గముతో నాహృదయమును ఛేదింపుము.

రాణికిఁ బిడుగు వడినట్లాయెనో చె. అయినను గొంతతాలిమి వహించి యామె "ప్రాణేశ్వరా! ప్రపంచమున నిట్లెందేని జరిగెనా?" యనెను.

రాజు:---సంకెలల వేసికొనుటకై జీవించుట నాకిష్టము లేదు.

రాణి:---ఇట్టికార్యమునకు నే నెట్లొప్పడ నేర్తును? జీవితేశ్వరా! మన్నింపుము—

ఇంతలో రాజు ననుచరులలోని యైదవ యాశ్వికుఁడుఁగూడ గాయపడి నేలఁగూలెను. అదిచూచి, రాజు పరాభవక్లేశజనిత క్రోధముతో "నిట్టి సమయముననే కదా నామానముఁ గాపాడెదనని నీవు పంతముచేసి యుంటివి" యనెను. చక్రవర్తి సైనికులు రాజుపైకి వచ్చునంతలో రాణి తన కటారును రాజువక్షమునఁ

గ్రుచ్చెను. ఎదనుండి రక్తము ప్రవాహమువలె గారు
చుండినను ముఖమునఁ జిఱునగవు వ్యక్తమగుచుండెను.

అక్కటకటా! ఎట్టి విషాదకరమగు దృశ్యము!
ఏయువతి భర్తకొఱకుఁ దన ప్రాణముల నర్పింప సిద్ధ
ముగనుండెనో యాయువతి తనభర్తకు హంతకురా
లయ్యెను! ఏ వక్షస్స్థల మామె యౌవనసౌఖ్యములకు
స్థానమైయుండెనో, ఏ వక్షస్స్థలమామె యాసలకాట
పట్టుగను, మనోరథమ్ముల కాశ్రయమ్ముగను, నుండెనో,
ఏ వక్షస్స్థల మామె గౌరమునకుఁ గాపరిగను, ప్రేమ
కు నిదానముగను, నుండెనో, యావక్షస్స్థలమును నేఁడు
సారంధా కరవాలము ముద్దిడుకొనుచున్నది! ఈ ఖడ్గము
విధి నిర్వాహంపుఁ గోరు! ఈ ఖడ్గ మనురాగపు బల్లె
ము! కానిచో నే స్త్రీ ఖడ్గ మిట్టిపని చేయఁ గల్గును?

ఆహాహా! ఆత్మగౌరవాసక్తి యొక్క పరిణామ
మెట్టి సంతాపకరమైనదో చూడుఁడు! ఉదయపుర
మార్వాడదేశ [illegible]ములలో సైత మాత్మ గౌరవము
యొక్కయు, ధైర్యసాహసములయొక్కయు నిట్టియుదా
హరణము లగపడుట దుర్లభము! తమ ప్రాణములఁ
బాయుట స్త్రీలకుఁ గడు సులభమైనకార్యము. కాని,
యిట్టికార్యమును సారంధానలనఁ దప్ప మఱి యేవనిత

వలనను నెఱవేఱియుండలేదు. అసూయవలనను, విషయ సుఖాసక్తివలనను, దమభర్తలయుసురులఁ గొనినస్త్రీలనేకులు గలరు. కాని కర్తవ్యనిర్వహణమునందు, పాతివ్రత్యరక్షణమునందును, ఆత్మగౌరవ నిరతియందును, ఇట్టికీర్తిప్రదమగు బలిదానము ఎచ్చటను గానరాదు!

సారంధాయొక్క నిరుపమానధైర్యమును జూచి చక్రవర్తిసైనికులు చిత్రప్రతిమ లైరి. వారి మనసునం దుండిన విరోధము గౌరవభావముగ మాఱెను. అంత వారిసరదారులుముందడుగిడి యిట్లువిన్నవించిరి. "అమ్మా! మేమందఱమును మీదాసులమని దైవసాక్షిగఁ బ్రమాణము సేసెదము. మీయాజ్ఞ మాకు శిరసావంద్యము." రాణి యామాటలకుఁ జిఱునవ్వునవ్వి "మా కుమారులలో నెవ్వఁడైన బ్రతికియుండెనేని, మాశవములను వానికి నప్పగింపుఁడు" అని చెప్పి రక్తసిక్తమైన యాకటారును దన రొమ్మునఁ గ్రుమ్ముకొని, భర్త వక్షస్స్థలమునఁ దల నునిచి నేల కొఱగి ప్రాణములఁ బాసెను.

గీ॥ కాలమా! యొకించుక మమ్ముఁ గనికరించి
మా కొసఁగరాదె మా మహామహుల మరల? అజ్ఞాతకవి.

---

# ముసలిదాని యుసురు



## ప్రథమ రంగము

గీ. దీనయగు నాముదాని దుఃఖానలమునఁ
మాడుకాలేదె ద్వారకాపట్టణంబు ! సాడీకవి

భైరవమూర్తి ధుమ ధుమ లాడుచు గుమ్మము వెలుపలికివచ్చి విసుకుకొనుచుఁ బల్కెను "ఇటువంటి బ్రతుకుకంటెఁ జావుమంచిది."

మృత్యుదేవతను దిట్టనివాఁ డీప్రపంచమున సాధారణముగాఁ గానరాఁడు. మనుష్యుని చేతిలోనే యుండిన పక్షమున మృత్యువు నామమాత్రావశిష్టమైయుండును. మృత్యుదేవతను బిలచువారు కూడఁ జాలమందిగలరు; కాని యన్ని యాహ్వానముల నంగీకరించుటకు దానికి తీఱికయెక్కడిది? కావలసినంత తీఱికయే యుండినచో నేఁడు జగమంతయు నిర్మానుష్యమై యుండెడిది !

భైరవమూర్తి మాయవర గ్రామములోఁ బ్రసిద్ధుఁడగు దేశపాండ్యా. గొప్పవంశస్థునకుండవలసిన లక్షణము లన్నియు నతనియందుండెను. అహంభా

వము, దౌర్బల్యము, ఎంత విస్తారముగా నుండెనో, ఆతని యందాగూడ నంతయెక్కువగా నుండెను. మనమూర్తికి పైఁజెప్పిన గుణములు పిత్రార్జితమైన యాస్తి. అతఁడు ప్రతిదినము ప్రాడ్వివాక న్యాయస్థానము(మునసబుకోర్టు) లోపలి యొక వేఁపచెట్టుక్రిందఁబగుల్లువాసిన యొకబల్ల మీఁద దస్తరము విప్పుకొని కాగితములఁ దిరుగ వేయుచుఁ గానవచ్చుచుండును. ఏదైన 'లా'విషయ మునుగుఱించి కోర్టులో వాదించుచుండఁగా నతనిజూచిన వారెవరును లేకపోయినను, జనులందఱు, ఆయనను 'వకీలుగారు' 'వకీలుగారు' అని వాడుకొను చుందురు. మండుగాడ్పులు వీచుచున్ననుసరే, కుంభవృష్టి గురియు చుండిననుసరే, వడగండ్లు రాలుచుండిననుసరే, ఆయన స్వస్థానమును వదలువాఁడుకాఁడు. కోర్టునకుఁ బోవు చుండువేళ, పల్లెటూరివాండ్ర గుంపొకటి యాతనివెంట నడుచుచుండును. గుంపులోని ప్రతివాని దృష్టియు గౌరవభావ మిశ్రితమై యాతనిపైనఁ బ్రసరించు చుండును. అంతేకాదు. చుట్టుప్రక్కల గ్రామములలోని వారందఱకును నొకటే విశ్వాసము. "ఇతని నాలుక మీఁద సరస్వతీదేవి యున్నది."

ఇది వకాల్తువృత్తి యగునోకాదో మాకుఁదెలియదు గాని, మొత్తముమీఁద నిదియాతనికి అనువంశికమగు వృత్తి. గౌరవ ప్రతిఫలము కోరకుండచేయు వృత్తి. ఆదా విశేషముగావచ్చుచుండెనను మాట, మాకు తెలిసియున్నంతవఱకు, కేవల మసత్యము. వెండినాణెములు చేతిలోనికి వచ్చుమాటలేదుగదా, రాగినాణెములైనను నతనిచేతిని సమీపించుటకు సందేహించుచుండును !

భైరవమూర్తికి 'లా' వచ్చుననుమాట నిర్వివాదాంశమే; కాని 'మొగమోట' మార్జనకడ్డము వచ్చుచుండునఁట. ఏకారణమైననేమి, ఈవృత్తి యతనికి గౌరవవృత్తియేకాని వేఱుకాదు. అతని సంపాదనకు రెండే మార్గములు. అవి, చుట్టు ప్రక్కలనుండు ధనవంతురాండ్రగు వితంతువుల వ్యవహారములను జక్కఁబెట్టుట; సంపన్నులై తెలివిమాలిన గృహస్థుల పనుల నెఱవేర్చుట. వితంతువులు తమద్రవ్య మాతని యొద్ద దాచుకొను చుందురు. అవిధేయులగు కుమారులచేతఁ జిక్కకుండ ముసలివాండ్రు తమడబ్బు నతని కప్పగించుచుందురు. అతని పిడికిలిలోనికిఁ బోయినతరువాత డబ్బు బయటికివచ్చుట యెఱుఁగనే యెఱుఁగము. మనమూర్తి

అప్పుడప్పుడు నప్పుకూడఁ జేయుచుండును. సంసారియైన వానికి ఋణములేక యుండునా ? సాయంతనము వేళ నిచ్చెదనని యతఁడు బదులు తీసికొనును గాని సాయంత్రమెన్నఁడును రానేరాదు ! అప్పులవాండ్రకు పైకముఁ జెల్లించుట జీవితకాలములో నతఁడెఱుఁగఁడు. ఇది యాతనికి తరతరములనుండి వచ్చిన పూర్వాచారము గాని క్రొత్తదికాదు.

ఇట్టి వ్యవహారములు గొన్ని వేళల నతని సౌఖ్యమునకు భంగముగలిగించు చుండును. 'లా' విషయమున నతనికేమాత్రము భయములేదు. 'లా' రంగమున మనమూర్తితోఁ బోరాడుట పర్వతమును ఢీకొనుటయే. కాని, తుంటరులు కొంద అతనిపై నపోహములు కల్పించి, అతనివర్తనము మంచిదికాదని యనినప్పుడును, దుర్భాషలాడి నప్పుడును, అతనికిఁ జాల కష్టముగా నుండును. ఇట్టి సందర్భములు ప్రతిదినము వచ్చుచుండెను. ఇట్టి తుంటరుల చేష్టలనుజూచి కొన్ని సమయములలోఁగొద్ది పాటిమనుష్యులు గూడ మూర్తియ సౌఖ్యమునకుఁగారకు లగుచుండిరి. కాదేని, చిల్లిగవ్వచేయని కూరలమ్ము 'మైసికి' అతనియింటికిఁ బోయి కఠినవచనములచే నొప్పించునంతటి సాహసము పుట్టు

నా? అతఁడేమి క్రొత్తవాఁడా? ఎన్నియో సంవత్సరములనుండితనయొద్ద కూరగాయలఁ గొనుచుండినవాఁడు. పైసలియ్యలేదనియే యనుకొనుఁడు. ఇంతలోనిల్లువాఁడఁ బెఱికికొని యెచ్చటికైన పాఱిపోవునా? నేఁడియ్యక పోయినచో మఱినాలుగు నెలలకిచ్చును. ఇంతలో ముంచుకొని పోవునదేమి? కాని, మైసికి ఓపికయెక్కడిది? రెండేండ్లయి నంతమాత్రమున, పావలా డబ్బులకొఱకుఁ బెద్దమనుష్యుని నవమాన పఱచినది! ఇట్టి సమయమున మూర్తికిఁ గోపమువచ్చి విసికికొని మృత్యువును బిలచినచో నందు దోషమేమియున్నది?

---

## ద్వితీయరంగము

ఆ గ్రామమున 'అంకమ్మ' యను బ్రాహ్మణవితంతు వొకతెయుండెను. ఆమె భర్త బర్మా పటాలములో హవాల్దారు పనిఁజేసి యుద్ధమునఁ జనిపోయెను. ఆతని యుద్యోగమును మెచ్చుకొని సర్కారువారు, 'అంకమ్మకు' అయిదువందలరూపాయలిప్పించిరి. తాను, ఆఁడుది. కాలము, మాయలమారిది. కనుక, అంకమ్మ, ఆద్రవ్యమును మన భైరవమూర్తి యొద్దనుంచి నెలనెలకుఁగావలసినంత డబ్బు తీసికొని కాలముగడపుకొను

చుండెను. కొన్ని సంవత్సరముల కాలము మూర్తి పైకము చెల్లించుచువచ్చెను. కాని, ఎంతకాలమైనను, అంకమ్మ, చావదయ్యె. 'సగమైనను నాకు వదలునో వదలదో కదా' యను సంశయ మాతని బాధింప సాగెను. ఒకనాఁడు అతఁడామెతో ఖండితముగా నడిగెను "ఏమి, అంకమ్మా! స్పష్టముగాఁ జెప్పుము, నీవు చస్తావా? నన్ను చావమంటావా?"

ఆనాఁడు, అంకమ్మ కన్నులు తెఱచెను, "నా లెక్క యెంతో చెప్పండి" యనెను. లెక్కదెంత యాలస్యము! వసూలు బాకీ సిద్ధముగానే యుండెను. వసూలుపోఁగా మిగతసున్న! ముసలితనమునకు సహజమగు కాఠిన్య ముతో, అంకమ్మ, మూర్తి చేయి పట్టుకొని యిట్లనెను. "నా రెండువందల యాభై రూపాయలూ మింగినావు. వాటిలో చిల్లిగవ్వ వదలి పెట్టను. ఏమనుకున్నావో ?"

మాట మాత్ర మనినది కాని దిక్కులేని యంకమ్మ కోపమునకు భయపడు వాఁడెవఁడు? అదేమి చేయును? వ్రాత, పూత, రాదు. లెక్క, పత్రము, అంతకు ముందేరాదు. పంచాయతీ తప్ప మఱేయాశయును లేదు. గ్రామములోని పెద్ద మనుష్యులుకూడి పంచాయతీచేసిరి. భైరవమూర్తి హృదయము గంగాజలము

వలెఁ బవిత్రమైనది! ఆతని కేమి భయము? అందఱ యెదుట నిలచి యాతఁడిట్లనెను. "అయ్యలారా! తమ రందఱు మర్యాదగలవారు. న్యాయబుద్ధికలవారు. నేను తమ పాదధూళివంటివాఁడను. తమ యందఱ పోషణ వలన బ్రదుకుచున్న వాఁడను. తమ యనుగ్రహము తమ యౌదార్యము నాశరీరములోని యొక్కొకయణు వును నిర్మించినది. దిక్కుమాలిన వితంతువు సొమ్మును నేనపహరించితి నని సత్పురుషులగు మీరు తలఁచు చున్నారా?"

పంచాయతీదారులు, ఏక గ్రీవముగాఁ బలికిరి "మీరాప్రకారముచేయు వారు కారు. కారు."

"అంకమ్మ డబ్బు నేను మ్రింగినానని మర్యాద గల మీరు తలఁచిన పక్షమున నేనూతిలోనో పడుట తప్ప నాకు నుపాయాంతరము కానరాదు. నేను ధన వంతుఁడను గానుగదా! ఔదార్యము కల వాఁడనని నేను చెప్పుకొనను గాని నాకలము బలమునను, దమ యనుగ్రహబలమునను, ఒకని యెదుట చేయిఁజాపవల సిన యవసరము లేదు. దిక్కుమాలిన యొకముఁడుదాని ద్రవ్యమును హరించునంతటి తుచ్ఛకార్యమునకు నేను లోఁబడుదునా?"

పంచాయతీదారులు మరల నేకగ్రీవముగాననిరి. "మీరట్టి పని చేయువారు కారు. ముమ్మాటికిఁగారు." 'నోరుకల వాఁడిదియూరు.' మూర్తిని నిర్దోషి యని పంచాయతీదారులు విడుదలచేసిరి. అంకమ్మకుఁ గల యీయాశయు నణఁగిపోయెను. మనస్సున కొంత యూఱటఁగలిగించు నాశ యొకటి మాత్రము మిగిలి యుండెను. "ఇక్కడఁ దప్పించుకుంటివి గాని, అక్కడఁ దప్పించుకుంటావా ?"

---

## తృతీయ రంగము

అంకమ్మను, ఆదరించువా రెవరును లేరైరి. దారిద్ర్యమూలములగు కష్టములన్నియు నామెతలపైనఁ బడెను. రాత్రిందివములు 'ధనము' అనునది తప్ప వేఱు ధ్యాన మామెకు లేదు. జాగ్రతావస్థయందేమి, స్వప్నావస్థయందేమి, సర్వకాలసర్వావస్థలయందును—భైరవమూర్తి స్మరణతప్ప వేఱుపనిలేదు. తన కుటీరద్వారమునఁ గూరుచుండి, ఆమె, మూర్తిని మనసు వచ్చినట్లు దీవించుచుండును. కొన్నివేళల నాదీవెనలు రసవంతములగు నుపమానములతోను, కావ్యోచితములగు

యమకములతోను, మిశ్రితములైయుండి వినువారికి నాశ్చర్యము కలిగించుచుండును!

అంకమ్మను జనించిన యీనిరాశ కాలక్రమమున వెఱ్ఱిగామాఱెను. వెంట్రుకలు విరియఁబోసికొని దిగంబరయై, చేత నొక గొడ్డలిఁబూని నిశ్శబ్దముగా నుండు స్థలమునకుఁబోయి కూర్చుండును. కుటీరమును వదలిశ్మశానములందును, నదీతీరములందును, పాడుగోడలలోను, దిరుగుచుండును. ఎఱ్ఱనికండ్లతోను, భయంకరమగు ముఖముతోను, ఎండిపోయిన కాలుసేతులతోను, నుండు నామెవిగ్రహమును జూచి జనులు భయపడుచుందురు. పూర్వమువలె నామె నిప్పుడు ఎవరును వెక్కిరింపరు. ఇండ్లకడకు రాఁగానే స్త్రీలుతలుపులు బిగించుకొనెదరు. పురుషులు ముఖములఁ దప్పించి వెడలిపోవుచుందురు. పిల్లవాండ్రు 'కాండ్రుకాండ్రుమ'ని పఱుగెత్తిపోవుచుందురు. అట్లు పరుగెత్తని ధైర్యశాలి మన భైరవమూర్తి కుమారుఁడు భేతాళమూర్తి యొకఁడే. తండ్రియందుఁ గొఱఁగానున్న దుర్గుణములను బూర్తి చేయుటకో యనునటు లీశ్వరుఁడీబాలుని సృష్టించెను. గ్రామములోని కుఱ్ఱవాండ్ర నందఱను వీఁడుచావఁగొట్టి చెవులు మూయుచుండువాఁడు. ఊరిలోని కుంటి

గ్రుడ్డివాండ్రందఱును వీని ముఖముఁ జూడఁగనే తిట్టు చుందురు. అత్తవారింటికిఁ బోవుట యనిన క్రొత్త యల్లున కెంత సంతోషమో తిట్లుతినుట యనిన మన భేతాళమూర్తి కంత సంతోషము. వీఁడు పిచ్చిదాని వెనువెంటఁ దిరుగుచు నది యూరు వెడలి పోవునందాక చప్పటలు చఱచుచుండును. పిచ్చిది, ఒంటరిగాఁ గూరు చుండి గంటలకొలఁది తనలోఁదానే మాట్లాడుకొను చుండును. ఇట్టిస్వగతములలో, భైరవమూర్తి మాంస మును, నెముకలను, చర్మమును, కన్నులను, ప్రేవులను, ఊడఁబెఱికితినుట, నమలుట, మ్రింగుట మొదలగు విషయములు మహదుత్సాహముతో బయటఁ బల్కు చుండును. ఈయుత్సాహ మతిరేకదశకు వచ్చినప్పుడు పిచ్చిది, భైరవమూర్తి యింటివైపు ముఖము త్రిప్పి భయంకరధ్వనితో "నీనెత్తురు తాగుతానురా !" యని కేక వేయును.

నిశ్శబ్దముగానుండు నిశాసమయములందు, ఈ కేక విని స్త్రీలదఱిపడి మేల్కొనుచుండిరి. ఈ కేక కంటె నెక్కువ భయంకరమయినది దాని యట్టహా సము ! పిచ్చిది, మూర్తిరక్తమును నిజముగానే తాను త్రాగుచున్నానని భ్రమించి, సంతోషమున బిగ్గరగా నవ్వును. ఈయట్టహాసమునఁ బిచ్చిదాని యానందమును,

క్రోధమును, మిళితములై వినువారిగుండెల వ్రయ్యలు సేయుచుండును. వందలకొలఁది కంఠములొకసారికూడి నవ్వుచుండినట్లు దోఁచును !

భైరవమూర్తి కొంకుజంకు లేనివాఁడు. అతనికి దీవానీ (సివిలు) వ్యవహారమనినను భయములేదు; ఫౌజ్దారి (క్రిమినలు) యనినను భయములేదు. కాని పిచ్చిదాని భయంకరములగు కేకలు మాత్ర మతని ధైర్యమును గదలించుచుండెను. ప్రాపంచిక న్యాయస్థానముల భయముండినను లేకపోయినను, పారలౌకిక న్యాయస్థానభయము మాత్రము ప్రతిమానవుని హృదయమునందును సహజముగా నుండును. ఎంతటి దురాత్ముని హృదయమునందైనను నీభావమొక్కొకవేళఁ బెకలించుకొని బయటకు వచ్చును. భైరవమూర్తి భార్య నాగమ్మ భర్తయెడ మిగుల విశ్వాసముగలదై, స్వీయ వర్తనమువలన సహధర్మచారిణి యనిపించుకొనుటయే కాక, అను దినమువచ్చుచుండు వ్యవహారములలోను వివాదములలోను భాగము గొనుచుండును. ఆమె వాగ్విజృంభణము స్త్రీజనమునందంతటనుసుప్రసిద్ధము. వ్రాత యక్కఱ లేకుండ నోటిమాటతో జరుగవలసిన వ్యవహారముల నన్నిఁటి నామెయే పరిష్కారము

చేయును. మన పెద్దమూర్తి నాలుకపైన సరస్వతీదేవి యున్నదని యనుకొను వారిది పొరపాటు. ఆగౌరవమున కర్హురాలు నిజముగా నాగమ్మకాని యాతఁడుకాఁడు. ఒక్కమాటలో, భైరవమూర్తికిఁగల లేఖనాసామర్థ్య మామెకు వాక్కునందుండెనని చెప్పవచ్చును. ఈ భార్యాభర్త లిరువురును 'దీనికేమి యుపాయముచేయు దము'అని యొంటరిగా నాలోచించుకొనుచుండిరి.

---

## చతుర్థరంగము

అర్ధరాత్రివేళ యయ్యెను. మన పెద్దమూర్తి నిద్రించుచుండెను. ముసలిది హఠాత్తుగా నతని వాకిట నిలచి బిగ్గరగా "నీ నెత్తురుతాగుతానురా" యని యఱచి పక్కున నవ్వెను!

ఆవికట హాస్యమునకు భైరవమూర్తి మేల్కొని, భయముచే గడగడలాడుచు ధైర్యము చిక్కఁబట్టి గది తలుపుఁ దెఱచి నాగమ్మను లేపెను.

నాగమ్మ యదరిపడి లేచి "ఏమిసంగతి?" యని యడిగెను.

భైరవమూర్తి గద్గదస్వరముతోఁ బల్కెను"అది వచ్చివాకిట నిలచినది."

నాగ. "ఏమనుచున్నది."

"నీ శ్రాద్ధము!"

"గుమ్మములోనున్నదా?"

"ఆ! దాని యఱుపు నీకు వినరాలేదా?"

మూఁడు ముక్కలు, అవతలఁబెట్టి నోరుమూయించవచ్చునను ధైర్యము కలదగుటచేత, నాగమ్మ కొంత తెప్పరిల్లుకొని, "నేను పోయి నాలుగుచీవాట్లు పెట్టి వెళ్లగొట్టుతాను చూడండి."యనెను. కాని భైరవమూర్తి భార్యను పోనియ్యలేదు.

తరువాత భార్యాభర్తలిరువురును తలుపునొద్దకుఁబోయి సందులలోనుండి తొంగిచూచిరి. ముసలిది నేలమీఁదఁబడి యుండెను. శ్వాసము వేగముగాఁ గొనుచుండెను. భైరవమూర్తి రక్తమాంసములను గోరి కోరి యామె రక్తమాంసము లెండిపోయెను. చేతిత్రో సంటినంతమాత్రమున నేలపైఁ బడునంత దౌర్బల్యమామె నావహించెను. అట్టిస్థితియందు నామెఁజూచిన వారిలో ననేకులు భయకంపితులగు చుండిరి.

రాత్రిగడచెను. తలుపులు బిగిసియే యుండెను. కాని భైరవమూర్తికిఁగాని నాగమ్మకుఁగాని కునుకు పట్టలేదు. అట్లేకూర్చుండి యుండిరి. అంకమ్మ విగ్రహ

ముఖ్యంగా నామె ధ్వనియే యెక్కువ భయము కలిగించు చుండెను. అంకమ్మను లోనికి రానియ్యరేమో కాని ధ్వనిరాకుండ నెట్లాపఁగలరు?

తెల్లవారిన తరువాత మనమూర్తి బయటికివచ్చి ముసలిదాని నడిగెను. "ఇక్కడ యెందునకుఁ బను కున్నావు?"

ముస: "నీ నెత్తురు తాగుతాను."

నాగమ్మ గ్రుడ్లెఱ్ఱఁజేసి, "నీదవడలు పగుల గొడ్తాను" అనెను.

ముసలిది నాగమ్మ తిరస్కారమును లెక్కసే యక పకపకనవ్వెను. నాగమ్మ తెల్లపోయి యూర కుండెను! నవ్వునకుఁ బ్రత్యుత్తర మేమికలదు?

భైరవమూర్తి మరల ముసలిదానితో "ఎంత సేపు పడుకుంటావు?" అనెను.

ముస: "నీ నెత్తురుతాగేవఱకు."

భైరవమూర్తి లేఖనాసామర్థ్యముగాని, నాగమ్మ వాక్సామర్థ్యముగాని, ఈసమయమున నేమి పనియుఁ జేయులేక పోయెను. ఇద్దఱును నింటిలోనికిఁబోయి "ఈ పాడు పీడయెట్లావదలుతుంది" అని విచారింపసాగిరి.

గ్రామదేవతలు జంతువుల రక్తమును ద్రావి తృప్తిఁజెందును; కాని యీ ముసలిది మనుష్యరక్తమును గోరుచున్నది, ముల్లుగ్రుచ్చుకొని కొంచెము రక్తము వెడలినప్పుడే మనమూర్తి యెంతో పరితాపపడుచుండునే. అట్టివాఁడు తనరక్తమును నీ రాక్షసికెట్లప్పగించును? ఈ తనిరక్తముఁ ద్రావి ముసలిది మరలఁ జిగురించునా?

ముసలిది మూర్తివాకిట వచ్చిపడియున్న వార్త గ్రామమంతటను వ్యాపించెను. పంతులకుఁ బరాభవమగుట యందఱకిష్టమే కనుక వందలకొలఁది జనులు గుంపులుగూడి యాతనివాకిట వచ్చినిలచిరి. అతని గుమ్మమున నిట్టి తిరునాళ్ల సాగుట క్రొత్తవింతకాదు. అయినను, మునుపటిగుంపులలోను, నిప్పటి గుంపులోను, భేదము లేక పోలేదు. మునుపు జనుల్లరిచేయు చుండువారు. ఇప్పుడో, వారు నిశ్శబ్దముగనుండిరి. వాకిట నీజనసమూహ ముండుట భేతాళమూర్తి కసహ్యముగఁ దోఁచెను. ముసలిదానిమీఁద వానికిఁ బట్టరానికోపము వచ్చుచుండెను. "దప్పికవుచున్నదేమో బావియొద్దకు బోదముర" యని యక్కడకుఁ దీసికొనిపోయి దభాలున ముసలిదానిని నూతిలోఁ బడఁద్రోసితినా, ఎంత చప్పు

డగును ! ఎంత తమాషాగా నుండును ! వీలు లేకపో యెగదా" యని వాఁడు తనలోఁదా ననుకొనుచుండెను. కాని, ముసలిదాని కచ్చటినుండి కదలుటకే శక్తి లేదాయెను. కనుక నాతుంటరి మఱియొక్క పన్నాగముఁ బన్నెను. భైరవమూర్తిగారి యింటిలో శల్యావశిష్టమగు నావొకటి యుండెను. దానికిఁ బ్రతిదినము గానుఁగపిండి, పొట్టు, మొదలైనవి యేమేమో పెట్టుచుండిరఁట కాని, అవెక్కడకుఁ బోవుచున్నవో, ఆవు నానాఁటికిఁ గంకాళ మగుచువచ్చెను. భేతాళమూర్తి యాయావుపేడ నొకకడవెడు నీళ్లలోఁగలిపి యాకలాపి తెచ్చి ముసలిదాని ముఖముమీఁదఁ గ్రుమ్మరించి కొన్ని బొట్లు గుమిగూడియున్న జనులమీఁదఁగూడ వెదఁజల్లి వాకిని సత్కరించెను. పాపము! ముసలిది తడిసి ముద్దయ్యెను. చుట్టును మూగియుండిన జనులబట్టలు చెడి పోయెను. "ఇది, ఇంకొకటి, ఇంకొకటి, కాదు. భైరవమూర్తిగారి గుమ్మము రా బాబూ! నిలిచియుంటిమా ఇంక నెక్కువ శాస్తి జరుగుతుందిరా!" అని వారందఱు యథాయథలై పఱువిడిరి. అంతట భేతాళమూర్తి చప్పటలు చఱచుచు లోనికిఁ బోయి కడుపుబ్బ నవ్వసాగెను. అక్రమపు గుంపును నంతయుక్తితోను, అంత

సుకరముగను, దొలఁగించినందునకుఁ దండ్రి కుమారుని వీపుచఱచి 'సెబాస్, సెబాస్' అని సంతసించెను. ఎవరు పోయినను ముసలిది మాత్ర మెప్పటివలె వాకిటనే యుండెను!

మధ్యాహ్నమైనను ముసలిది యేమియును దిన లేదు. సాయంత్రమయ్యెను. ఎంత బ్రతిమాలుకొని నను నామె యన్నము ముట్టలేదు. కరణముగా రామె నెంతో పొగడి యన్నము తినుపింపఁ జూచెను. భైరవ మూర్తి కూడ దోసిలియొగ్గి ప్రార్థించెను. కాని ముసలిది యొప్పుకొనలేదు. 'కడుపులో సురసురలాడి నప్పుడది యే తినును' అనుకొని యాతఁడింటిలోనికిఁ బోయెను. ఆరాత్రికూడ ముసలి దన్నము, నీరు, ముట్టక గడిపెను. భైరవమూర్తి, నాగమ్మ, యారాత్రికూడ నిద్రయెట్టిదో యెఱుఁగరు ఈ రెండవ రాత్రి ముసలిదాని యఱపు,నవ్వు, తక్కువగానుండెను.'పీడవదలినదిలే' యని యింటిలోని వారనుకొనిరి. ఉదయమున వచ్చి చూచువఱకు ముసలిది కదలికలేక పడియుండెను. ముఖమునిండ నీఁగలు మూఁగి యుండె. ప్రాణము పోయినది! పాపము ప్రాణములు పోగొట్టుకొనుటకే యామె యచ్చటికి వచ్చియుండెను. తన ద్రవ్యమును హరించిన వానికే తన ప్రాణములను

గూడ నప్పగింప నిశ్చయించుకొని యుండెను. తుదకుఁ దన కళేబరమును గూడ నితనికే యర్పించెను. ధనమెంత ప్రియమైనదో చూడుఁడు! ముఖ్యముగా ముసలితనమున నది ప్రాణముకంటెను ప్రియతరమైన దగును!!

ఆదినమున గ్రామమందెంత గడబిడ జరిగెనో భైరవమూర్తిని జను లెంత దూటిరో వివరింపవలసిన పనిలేదు. అతఁ డనుభవించిన యవమానము వర్ణనాతీతము. గ్రామములోని మాలవాఁడు గూడ వారింటి నీరు ద్రాగుటకుఁగాని వారిని ముట్టుకొనుటకుఁగాని, ఇష్టపడలేదు. మంగలవాండ్రు వారికి క్షవరము చేయఁగూడదనియు, సీళ్ల బ్రాహ్మణుఁడు సీళ్లుపోయఁగూడదనియు, నిశ్చయించుకొనిరి. ఇట్టి కార్యము జరుగవలయునని తలఁచియే ముసలిది మూర్తివాకిటఁ జచ్చెను. 'బ్రతికియుండి చేయలేని పనిని చచ్చి నెఱవేర్చెదఁగాక' యని యామె యనుకొని యుండెను!

---

## పంచమ రంగము

భైరవమూర్తి 'లా' తెలిసినవాఁడు కాని సామాన్యుఁడుకాఁడు. 'లా' ప్రకారము మతఁడు చేసిన నేరమే

లేదు. ముసలిది శిక్షాస్మృతిలోని ఫలాని సెక్షన్ ప్ర
కారము చచ్చినదని చెప్పుటకు వీలులేదు. లాఁరిపోర్టు
లలో నిట్టినిదర్శనములేదు. కనుక భైరవమూర్తికిఁ బ్రా
యశ్చిత్తమే యవసరములేదు. "బ్రాహ్మణుఁడు నీళ్ళు
పోయక పోయిన మనమే తెచ్చుకొన వచ్చును. మన
యింటిపనిని మనమే చేసికొనుటకు సిగ్గేల? మంగలి
వాఁడు క్షవరముచేయక పోయిన మానె; అసలు క్షవ
రము చేయించుకొనవలసిన యవసరమే లేదు. గడ్డము
పెరిగినచో నందముగా నుండును. పురుషుఁడగువాని
కది యలంకారము. వెంట్రుకలు పెరిగి యంతగా
బాధించినట్లయిన నొక యణాయూవలఁ బాఱవేసినఁ
గత్తి యొకటి దొరకును. చాకలివాఁడు బట్టలుతకక
పోయిన మఱియు మంచిది. దమ్మిడీపెట్టిన సబ్బు
బిళ్ల వచ్చును. ఎన్నిబట్టలనైనను దానితో కొంగరెక్కల
వలెఁ దెల్లగా నుదికి కొనవచ్చును. అసలు చాకలివాని
యుతుకేపాటిది? వాఁడు బట్టలను బండమీఁదఁ జఱచి
చఱచి పాడుచేయును. తాను తొడుగుకొనును; మంది
కిచ్చును. అందువలననే కదా నాకుపత్తాలు రెండు
మూఁడు సంవత్సరములకన్న నెక్కువకాల మాగవు.
మాతాతగారి కాలములో రెండు కుడతా లయిదు సంవ

త్సరము లుండెడివి!" అనుకొనుచు భైరవమూర్తి యును, భార్యయును, మనస్సమాధానము చేసికొనిరి.

సాయంత్రమైన కొలఁది వారి తార్కికశక్తి తగ్గ సాగెను. కారణము లేని భయమొకటి హృదయము నావరింపఁజొచ్చెను. రాత్రి కాఁగానే యాభీతి మఱి మఱి హెచ్చెను. వంటయింటిలోనికి నాగమ్మ యొంటరి గాఁ బోలేక పోయెను. పొరపాటు వశమున వారా నాఁడు బయటి ద్వారమును మూయమఱచిరి. ఆతలుపు మూసివచ్చు ధైర్య మొకరికిని లేకపోయెను. తుదకు నాగమ్మ చేత దీపముఁబూని భైరవమూర్తి గొడ్డలిని, భేతాళమూర్తి కొడవలిని, బట్టుకొని వెంటరాఁగా తలు పుబిగించి వచుట్చుకై వెడలెను. వారు నడుమ నడుమ దగ్గుచు వెనుకకుఁ జూచుచుఁ బోయిరి. అంత భైరవ మూర్తి మహాధైర్యముతో ద్వారము బయటకుఁ బోవ యత్నించి వడవడ వడఁకుచు, బలవంతముగాఁ దెచ్చి కొనిన గట్టి ధ్వనితో నాగమ్మనుజూచి యనెను. "ఎందు కీవెఱ్ఱిభయము; ముసలి దక్కడఁగూర్చున్నదా?"

నాగమ్మ భర్తను లోపలికి లాగి, "ఏమిటి, ఈపిల్ల చేష్టలు!"

ఇట్టి ఘనకార్యమును సాధించి వాగు మువ్వురు వంటయింటిలోఁ బ్రవేశించిరి. వంటయారంభమయ్యెను.

అయినను, ముసలిదాని యాకారము వారి దృష్టియెదుట చిత్రితమైయుండెను. తమతమ నీడలను జూచి యది ముసలిదని వారు భ్రమింపసాగిరి. చీఁకటిగానుండిన మూలలలో ముసలిది కూర్చుండి యున్నట్లు వారికిఁ దోఁపసాగెను. అదే అస్థిపంజరము; అవే జడలు కట్టిన వెండ్రుకలు; అదే వికృతాకారము; ఆవే భయంకరములగు కండ్లు! వేయేల? ముసలిదే యాపాదమస్తకము వారికిఁ గానవచ్చుచుండెను. వంటయింటిలో ధాన్యపుకుండ లుండెను. ధాన్యమును జూచు భాగ్యము వాని కెన్నఁడైన లభించినదో లేదో చెప్పఁజాలము. కుండల సమీపమున రెండు కట్టెపుల్లలుండెను. ఎలుకలు కుండలచాటున నటునిటుఁ బరుగెత్తుటవలనఁ గొంత ధ్వని యగుటయేకాక రెండు కట్టెపుల్లల స్థలము కూడ మారెను. ఇంకేమి కావలెను? కట్టెపుల్లలు ముసలిదాని కాళ్లవలె వారికిఁ గన్పట్టె. నాగమ్మ కెవ్వున కేకవేసెను. భైరవమూర్తి భయభ్రాంతుఁడై తలుపు నైపునుమికెను. భేతాళమూర్తి తండ్రికాళ్లను బిగ్గఁబట్టుకొని నిశ్చేష్టుఁడయ్యెను. అంతలో నదృష్టవశ

మున నెలుకలు బయటికివచ్చి వారి భయమును బోఁ
గొట్టెను. అప్పుడు భైరవమూర్తి యసహాయశూరుఁడై
కుండలవైపు పోఁబోవుచుండ "తెలిసిందిలేండి మీమగ
తనము" అని నాగమ్మ యెత్తిపొడిచెను.

నాగమ్మ పోటుమాటకు మూర్తి కోపగించు
కొని "భయపడితినని యనుకొన్నావు కాఁబోలును.
ఏమిభయము ? ముసలిదప్పుడే చచ్చెను. ఇంకను
గూర్చున్నదా? ఏమి ? ఇందాక నేను బయటి తలుపు
తెఱచికొని వీథిలోనికిఁబోవ సిద్ధపడలేదా? నీవు వద్దనఁ
బట్టిగాని లేకపోయిన నవతలికిఁ బోయియే యుందును!"

మూర్తిచేసిన యీయుక్తివాదము నాగమ్మను
నిరుత్తరురాలుఁగాఁ జేసెను. అంతకుముందు భైరవమూర్తి
ధైర్యముతో ద్వారము వెలుపలికిఁబోవుట—లేక, పోవ
యత్నించుట—సామాన్యకార్యమా ? అంతటిసాహస
మును బ్రదర్శించిన తరువాతఁగూడ పంతులును బిఱికి
వాఁడనినచో, నది నాగమ్మ మూర్ఖత్వముకాక మఱే
మగును ?

భోజనానంతరము వారు ముగ్వురు పడకగదిలో
నికిఁ బోయిరి. కాని, అచ్చట సైతము ముసలిది వారిని
వదలలేదు. చాలసేపు వారు మాటలాడుచు వినోద

ముగఁ గడపిరి. నాగమ్మ కొన్ని కథలుచెప్పెను. భైరవమూర్తి కొన్ని ఫౌజ్దారీ కేసులను వర్ణించి వానిలో జరిగిన తీర్పులు వారికిఁజెప్పెను. ఎన్ని యత్నములు చేసిననేమి? ముసలిదాని విగ్రహాము వారి కన్నుల యెదుటనే నిలచియుండెను. తలుపుచప్పుడు కాఁగానే వారులికిపడుచుండిరి. చెట్లయాకులలో మర్మరధ్వనికాఁగానే వారికి రోమాంచమగుచుండెను. అంతేకాదు. ఆకాశమునుండియో లేక పాతాళము నుండియో— ఎక్కడినుండియో తెలియదుగాని—మందమగు నొక ధ్వని 'నేను నీనెత్తురు తాగుతానురా' అనునది వారి చెవులఁ బడుచునే యుండెను.

---

## షష్ఠము రంగము

అర్ధరాత్రివేళ నాగమ్మ నిద్రలో నదరిపడి లేచెను. పాపము! నాగమ్మ గర్భవతి. నిప్పుకణములవలె నెఱ్ఱఁగాఁ ప్రకాశించుచున్న కండ్లను, పదునైన మొనల పండ్లను గల ముసలిది, ఆమె రొమ్ముమీఁద నెక్కికూర్చుండెను. నాగమ్మ కేకవేసి లేచి మైమఱచి వెఱ్ఱిదానివలెఁ బందిటి లోని కుఱికి నేలపైనఁబడెను. శరీరమంతయుఁ జెమ

టచేఁ దడిసెను. భార్యకేకవిని భైరవమూర్తి మేల్కొ
నెను. కాని భయముచేతఁ గన్నులు తెఱిపిడిపడవయ్యె.
కాళ్ళు తడఁబడసాగెను. గ్రుడ్డివానివలెఁ దలుపుఁదడవి
కొనుచుండెను. ఎంతోసేపైన తరువాతఁగాని యతనికిఁ
దలుపుదొరకలేదు. పందిటిలోనికి వచ్చిచూచుఁగదా
నాగమ్మ నేలమీఁదఁబడి కాలుసేతులు కొట్టుకొను
చుండెను. ఆమెను లేవఁదీసి లోనికిఁదెచ్చెను. కాని
యామె ఆరాత్రియంతయు కన్నులుతెఱవలేదు. తెల్ల
వారినదిమొదలు తబ్బిబ్బు మాటలాడసాగెను. మఱి
కొంతసేపటికి తీక్ష్ణమగు జ్వరమువచ్చి శరీర మంతయుఁ
బెనమువలెఁ గ్రాగుచుండెను. సాయంత్రమువఱకు సన్ని
పాతము పొడసూపి నిశ్శబ్దముగానున్న నిశాసమయమున
నామె యీలోకమును వదలెను. ముసలిదాని భయ
మామె ప్రాణములఁదీసి యేవైచెను. ముసలిదామె జీవిత
కాలమంతయు నెప్పుడును నాగమ్మయఱపులకు భయపడు
చుండెడిది. పిచ్చిదైనతరువాతఁగూడ నామె నాగమ్మ
నెన్నఁడును డీకొనలేదు. కాని, తనప్రాణములను వదలి
నాగమ్మ ప్రాణములను దీసికొనెను.

తెల్లవారి ప్రొద్దెక్కెను. శవవహనమునకు
గ్రామములోని వాఁడొకఁడైనను రాలేదు. భైరవ

మూర్తి, ఇల్లిల్లుతిరిగి వేసరెను. 'మేమురాము; మేము వానియింటి శవమును బట్టము' అనుమాటలే విన వచ్చెను. భైరవమూర్తికలము యొక్క సామర్థ్యము గాని, అతని వ్యవహారదక్షతగాని, ఈసమయమున నక్కఱకురాలేదు. తిరిగితిరిగి యింటికి వచ్చెను గాని లోన నడుగుపెట్ట మనసొప్పలేదు. బయటనుండుటయుఁగష్టము. లోపల భార్యశవము; బయట ముసలిదాని భయము. ఎట్లెట్లో ధైర్యముచేసి హనుమంతుని దండకము చదివికొనుచు లోనికిఁబోయెను. అప్పు డతనిభావము లెట్లుండెనో వర్ణించుటకష్టము. ఇంటిలో శవము పడియున్నది. చూడదిక్కు, మొక్కునైవము లేదు. ముందు వివాహముకాదేమో యను విచారముమాత్రము భైరవమూర్తికి లేదు. ఎన్నేండ్లవాఁడు? ఆఫాల్గుణమాసమునకే కదా! ఏఁబదిసంవత్సరములు వెళ్ళునున్నది! మహారాజువలె నాతని కెవరైన పిల్లనిత్తురు. కాని నాగమ్మవంటి వాక్చాతుర్యముగల భార్యలభించునా? అప్పుల వాండ్రను దలయెత్తకుండఁ జీవాట్లుపెట్టువారిక నెవ్వరు? వారితో వాదించి నిరుత్తరులను జేయువారెవ్వరు? ఆయ వ్యయముల నంతబాగుగా లెక్కచెప్పువారెవ్వరు? ఇఁక నెవ్వరి యాజ్ఞ లెరుఁగుపొరుగువారి హృదయ

ములను బాణములవలె భేదింపఁగల్గును? అయ్యో! ఇంతటినష్టము ఎట్లుతీరును?

ఆనాఁడు సాయంత్రమువేళ శవమును వెడలఁదీసికి శ్మశానమునకుఁబోయిన వారిద్దఱే. ఒకఁడు భైరవమూర్తి; రెండవవాఁడు భేతాళమూర్తి. దిక్కుమాలిన ముసలిదాని శవమైనను నింత నికృష్టముగాఁ బోలేదు.

ముసలిది, నాగమ్మను జంపిన తరువాతనైనను, భైరవమూర్తిని వదలలేదు. రాత్రిందివము లాతనికి ముసలిదాని ధ్యానమే. ప్రొద్దుపోవుమార్గ మేదైన నున్నచో నతనిబాధ కొంతతగ్గియుండును; కాని, యొక పురుగైన నాతని కడపఁ ద్రొక్కలేదు. తానే నీళ్ళు తెచ్చుకొనును. తానే యంట్లు తోముకొనును. దుఃఖము, క్రోధము, విచారము, భయము! ఇందఱ శత్రువులతో నతనిమేధ స్సెన్నిదినములు పోరాడఁగల్గును? అందు లో నది పనిలేనిమెదడా? సదా 'లా' విషయములను గుఱించిన యాలోచనములకును,తర్కవితర్కములకును, లోనైనమెదడు!

పంద్రెండుదినములు, ఈ ఏకాంతవాసశిక్ష గడచెను. పదమూఁడవనాఁడు భైరవమూర్తి తెల్లబట్టలు కట్టుకొని, దస్తరమును చంకనుంచి, ఎప్పటివలెఁ గోర్టుకుఁ

బోయెను. ఆనాఁ డాతని ముఖము కొంత వికసించి యుండె. "కోర్టుకు పోఁగానే పార్టీలువచ్చి చుట్టు మూఁగుదురు; నన్నూ అడింతురు; నేనును నాల్గు కన్నీటి బొట్లను రాల్చెదను. ఆతరువాత ట్రాన్స్ఫరుపత్రములు, రాజీనామా దస్తావేజులు, తాకట్టుపత్రములు కుప్పలు కుప్పలుగా వచ్చి కూలును; డబ్బులు దొరకును" అని తలఁచుకొను చుండునప్పు డాతని కానందముగానే యుండెను. కాని కోర్టుకుఁ బోయిన తరువాత నక్కడ పత్రములు లేవు; పయికము లేదు. పార్టీల తొందరయును లేదు. దస్తరము విప్పుకొని చాలసేపు కూర్చుండెను; కాని, ఒకఁడైన నతనియొద్దకు వచ్చిన పాపమునఁబో లేదు. కుశలప్రశ్నమైనను చేసినవాఁడు కానరాఁడయ్యె. క్రొత్త పార్టీలమాట యటుండ, తరతరములనుండి పరిచితులుగానున్న పార్టీలు సైతము, మొగము చాటువేసి దాటి పోవ నారంభించిరి. భైరవమూర్తి యెదుట దిగఁ దుడుపునకైనఁ బనికిరాని రామచంద్రయ్య యానాఁడందఱకు నాలోచన చెప్పువాఁడయ్యెను! అతనిచుట్టు పెద్దగుంపు మూఁగియుండెను. నాల్గుపట్లులురాని రామచంద్రయ్య కెంతటి యదృష్టము పట్టినది! సాయంత్రమువఱకుండి నిరాశావశుఁడై యింటివైపు మరలెను. ఇంటివైపున

కొక్కొక్క యడుగుపెట్టిన కొలఁది ముసలిదాని విగ్రహము
పొడకట్ట నారంభించెను! దీపము పుట్టించువేళకు
నిల్లుచేరి వాకిలి తలుపు తెఱవఁగానే యంతకు ముందు
భేతాళమూర్తి కొంటెతనమునఁ గట్టివేసియుంచిన రెండు
కుక్కలు తటాలునఁ బఱుగెత్తి వచ్చెను. ప్రాణములు
పైఁబైన నెగురఁ గేక వేసి నేలమీఁదఁ బడెను!

భైరవమూర్తిగతి తరువాత నేమైనదో తెలియ
దు. ప్రతిదినము నాతఁడు కోర్టుకుఁ బోవుచు సాయం
త్రము వేళ నిరాశతో నింటికివచ్చుచుఁగనఁబడుచుండెను.
కోర్టులోవచ్చు నాదాయము లేకపోయినను నచ్చటికిఁ
బోయివచ్చుట, అప్పులవాండ్ర బాధలఁ దప్పించుకొను
టకు మాత్రము దివ్యమైన యుపాయముగా నుండెను!
తరువాతఁ గొన్ని నెలలవఱకు నాతఁడు గానరాలేదు. బద
రికాశ్రమమునకుఁ బోయెనఁట! ఒకనాఁడు బైరాగి
రొకఁడు విభూతి ధరించి, పొడుగుపాటి జడలు, కేలఁ
గమండలవుఁబూని యాయూరికి వచ్చెను. మాటయందేమి
నడకయందేమి, ఆతఁడు భైరవమూర్తిఁ బోలియుండెను.
ఆరాత్రి మూర్తిగారి యింటినుండి పొగ నెడలి
నెడలి పెద్దమంట లేచెను. నాగమ్మ వాగ్జ్వాలలైనను
నంత భయంకరముగా నుండలేదు. వందలకొలఁది

జను లచటికిఁ బోయిరి. వినోదము చూచుచుండిరి కాని చల్లార్ప లేదు!

భైరవమూర్తి గ్రామము విడిచిపోయినతరువాత భేతాళమూర్తి మేనమామ యింటికిఁ బోయి యచటఁ గొన్ని దినములు గడపెను. అతని సద్వర్తన మచ్చటి వారికి సంతోషముగనుండ లేదు! ఒకనాఁడతఁడెవరి పొలములోనో కంకులు గోసికొనెను. పొలమువాఁడు నాలుగు లెంపకాయ లంటించెను. మనవానికిఁ గోపము వచ్చి రాత్రివేళఁ బొలమును బాడుచేసెను. వేలరూపా యలు నష్టమువచ్చెను. పోలీసువారు వానిని బట్టుకొని పోయిరి. ఇప్పుడతఁడు బహుశః జ్ఞానమఠములో నుండవచ్చును.

---

# నే నే



## ప్రథమ రంగము

ఆ. అయ్యలార! మనము నెయ్యంపుమాటలు
పెక్కుపలుక నేర్తు ముక్కువమున
కర్మచేతఁగాని ధర్మంబుచేఁగాని
చేసిచూపనేరి చేతఁగాదు. — సై. నృసింహశాస్త్రి.

ఇతరవిషయములలో గణపతిరావు నభిప్రాయము లీకాలపు యౌవనులవంటివేయైనను, నీతివర్తన విషయమున మాత్రమతని భావములు కొంతవఱకు విచిత్రములుగాను, సాధారణ దృష్టికిఁజాల మీఱినవిగాను, ఉండును. అతని యుద్దేశమున 'నీతివర్తనము' అను దానికి స్త్రీసంబంధమగు విషయసుఖాభిలాష లేకపోవుటయని యర్థము. ఇట్లనుటవలన నతనికి నీతివర్తనము దానికిఁగల విశాలమగు నర్థము తెలియదనికాదు. నిజమేమనఁగా నతఁడు 'నీతివర్తనము'లోని యీ ప్రత్యేక భాగమునకింతయని నిర్ణయించుటకు వలను

గాని ప్రాముఖ్యము నిచ్చుచుండును. స్నేహితులతో సంభాషించునపుడేమి, ఉపన్యాస వేదికపైన నుండునపుడేమి, పత్రికాదులకు వ్రాయుటకై కలమును జేతఁబూనినపుడేమి, పైనఁజెప్పిన 'నీతివర్తనము' అప్రయత్నముగనే బయటబడుచుండెడిది "...గారు చాలమంచివారు. వారి స్వార్థత్యాగము ప్రశంసనీయము. స్వలాభమునే యభిలషించియుండినచో వారిదివఱకున్నతన్యాయస్థానాధికార (హైకోర్టు జడ్జి) పదవికి వచ్చియుందురు..." అని ఎవరిని గుఱించియైనను నెవరైనఁ జెప్పినప్పుఁడతఁడు ముఖముచిట్లించి "అతఁడా! ఛీ! అంతటి దుర్మార్గుండెవ్వఁడును లేఁడు. అతని 'నీతివర్తనము'ను నీవు వినలేదు నాకుఁ దెలియును" అని వాదము మొదలుపెట్టును. "...గారు......లక్షల రూపాయలను విద్యాలయమునకై యిచ్చిరి. ఏమి? వారి యౌదార్యము!" అని ఎవరైనఁ జెప్పినపక్షమున "ఏడిసినాఁడు. అతనిని నేనెఱుఁగుదును. అతని వర్తనము తుచ్ఛమైనది. అంతటిజారుఁడు ప్రపంచములో లేఁడు" అని చెప్పనారంభించును. "......ఎంత ధనవంతుఁడైననేమి? పట్టుమని పదిరూపాయలు జాతీయ కలాశాలకిచ్చిన పాపమునఁబోలేదు. ఒక విద్యార్థికైనను వారమియ్యఁడు. అధికారులకుఁ దోటవిందులు సేయుట

యందుమాత్రము తన యౌదార్యమును జూపును" అని ఎవరినిగుఱించియైనను జెప్పఁబడినపక్షమున "అతని సంగతి నీకేమి తెలియును. అతని నీతివర్తనము శ్లాఘాపాత్రము" అని వాదమునకు దిగును. వేయేల? మనుష్యుల మంచితనమునుగాని చెడుతనమునుగాని నిర్ణయించుట కతనియొద్ద సాధన మొకటే కలదు. స్త్రీలోలత్వసబంధమగు దౌర్బల్యము గలవాఁడేని యతనియందితర సుగుణము లెన్నియున్నను సున్నయే. ఎట్టిదుర్గుణములు గలవాఁడైనను నట్టి దౌర్బల్యముమాత్రము లేదేని, అతఁడు బ్రహ్మరథముఁ బట్టఁదగినవాఁడే.

---

## ద్వితీయ రంగము

న్యాయవాది వృత్తిలోఁ బ్రవేశించినతరువాత, గణపతిరావుయొక్క యాదాయ ముద్యోగములోనున్న నాఁటికంటెఁజాల హెచ్చెను. నెలకు సుమారు వేయి రూప్యములు రాసాగెను. చిన్నతనమునుండియు నతఁడు చాల మితవ్యయబుద్ధికలవాఁడు. ఉద్యోగము చేయుచుండిన దినములలోఁగూడ నాతని మితవ్యయబుద్ధి యట్లే యుండెను. కాని న్యాయవాదియైనపిమ్మట నాదాయ

ముతోఁబాటు మితవ్యయాసక్తియు వృద్ధియై పిసినిగొట్టు
తనమును సమీపించెను. అంతేకాదు. అసూయాపరు
లనేకు లతనికి 'పిసినారి'యను బిరుదము నిచ్చిరి.
కాని, తానట్లు పిలువఁబడుటకుఁ గారణము మాత్రము
గణపతిరావునకొక్కనాఁడైనను గ్రాహ్యము కాలేదు.
'నేను లోభినా' యని యతఁడు పలుమాఱు విత
ర్కించుకొనెను. కాని ప్రతిపర్యాయమును 'కాను'అను
తీర్మానమే ప్రత్యుత్తరమిచ్చుచుండెను. 'వందలకొలఁది
రూప్యములు పాడుచేసి నేను పెద్దయిల్లు బాడుగకు తీసి
కొనలేదఁట! నా యింటిలో వ్యర్థముగ సోఫాలును కురి
చీలును, మూల మూలలఁబడి మూల్గుచుండలేదఁట!
నేను రెండుగుఱ్ఱముల 'బ్రూహాము' బండిని నుంచుకొన
లేదఁట! పనిపాటలులేక కునికిపాట్లు పడుచుండు నౌక
రులు నాయింటిలోఁ బదిమంది లేరఁట! కనుక నేనులోభి
నఁట! దక్షిణాఫ్రికా భారతీయుల నిధికి నేను ధనసాహా
య్యము చేయక పోవుటకుఁ గారణములు గలవు. గంధి
'యవలంబించినమార్గము జయప్రదమగునది కాఁజాలదని
నేనియ్యలేదు. బందరు జాతీయ కలాశాలలోఁ జెప్పు
విద్య దొరతనమువారి నిబంధనల ననుసరించి నదికాదు.
కనుక దానిలోఁజదువువారికి ముందు మంచియాశలు

లేవని తలంచి నేనా విద్యాలయమునకు సాహాయ్యము చేయలేదు. ఆంధ్ర రాష్ట్రోద్యమము మనదేశీయులలో సంతఃకలహమును బుట్టించునది కావున నది నాయా మోదమును బొందలేదు. కాకున్నచో నేను వీనికిని ద్రవ్యసహాయముచేసి యుండనా?' యని కొన్ని వేళలను, 'లోభి లోభి యని యోర్వలేనివారు కొందఱు నన్ను నిందించుచుందురే! తత్త్వము విచారించినచో లోభి యేకారణమువలన దూష్యుఁడో తెలియరాకున్నది. తాను కష్టపడి చెమట యోడిపి సంపాదించుకొనిన ధనమును జాగరూకతతోఁ గాపాడుకొనుట సుగుణమా? దుర్గుణమా? ముందెట్లుపోయి యెట్లువచ్చునో యని కొంతధనమును దాచియుంచుకొనుట దూరదర్శిత్వమా? వెఱ్ఱితనమా' యని మఱికొన్ని వేళలను, దలపోయుచు వృత్తివలనఁ దానార్జించిన యుక్తి నంతయు వినియోగించి తుదకు తాను నిర్దోషినని మనోనిశ్చయము చేసికొనుచుండెను. ద్రవ్యము విషయమున నతనిపట్టెంత గట్టిదైనను నవయౌవనయు సుఖేచ్ఛగలదియునగు హైమవతిని సంతోషపఱచి యామె వీక్షణములను ప్రసన్నములుగాఁ జేసికొనుటకొఱకైనను దనయిష్టమునకు మించి ధనమును నష్టు డప్పు డతఁడు ఖర్చుపెట్టక తప్పినదికాదు.

---

## తృతీయ రంగము

హైమవతి, యాకారమునఁ గొంచెము పొడవై బంగారమువంటి మనోహరమగు శారీరిక శోభతోను, దర్శనీయములగు ముఖలక్షణములతోను, ప్రకాశించుచుండును. గానమువలె మధురముగానుండు నామె కంఠధ్వని వినువారి వీనులకు విందుఁ గొల్పుచుండును. ఈశారీరిక సౌందర్యమునకన్న నెన్నియోగుణము లధికముగా నామె మానసిక సౌందర్య మాకర్షణీయమై యుండె.

సాధారణముగా మన హిందూస్త్రీలు చాల మృదులస్వభావము గలవారు. వారికిఁ జిత్తస్థైర్య ముండదు. క్రొత్తవా రెవరైన మందలించినచో వారు ప్రత్యుత్తరమిచ్చుటకు జంకెదరు. ఇల్లు విడిచి యవతలికిఁ బోవలసివచ్చినచో వెంట మనుష్యుఁ డుండిననే కాని వారి యడుగు ముందునకు సాగదు కొంచెమేదైన నాపదవచ్చినచో వారు కన్నీరు గార్చుట తప్ప మఱేమియుఁ జేయజాలరు. కాని హైమవతి స్వభావమట్టిదికాదు. తన సామర్థ్యమునం దామెకు సంపూర్ణ విశ్వాసము గలదు. ఆమె భావము లున్నతములై యుండెను. ఎట్టి యాపదలు వచ్చినను జంకెడుఁగదు. మంచి యాలోచనశక్తియును నట్టి శక్తి నుపయోగిం

చుటకు వలయు ధైర్యమును నామె పుట్టుకతోడనే వెంటఁ దెచ్చుకొనెను. పురుషులతో సంభాషింపవలసి నప్పుడును నామె నిర్భయముగా మాట్లాడుచుండును.

శ్రావణమాసము వచ్చినది. హైదరాబాద యందలి పురోద్యానము చూపులకు విందుఁ గొల్పు చున్నది ఎచ్చటఁ జూచినను పచ్చని పచ్చిక కానవచ్చు చున్నది. సాయంత్ర మయ్యెను. కృత్రిమములగు నీటి కొలనులలో నొక ప్రక్కనఁ బడవలమీఁదఁ గొందఱు నీటుకాండ్రు విహరించుచున్నారు; వేఱొక ప్రక్కనఁ బెద్దబాతులు తమ రెక్కలను విప్పుచు ముడుచుచు రెప రెపలాడించుచు గుంపులు గుంపులుగఁగూడి నీటిపైనఁ దేలి యాడుచున్నవి. కాలినడకను, ద్విచక్రికల (బైసికళ్లు) మీఁదను, గుఱ్ఱపుఁబండ్ల మీఁదను, స్వయంతోల నాశక్తిశకటంబులలోను, (మోటారు) గూర్చుండి, వచ్చుచుఁ బోవుచునుండు వారి సంఖ్యను లెక్కించుట దుస్సాధ్యమై యున్నది. ఆసమయమున గణపతిరావు తన యొంటిగుఱ్ఱపుబండి నెక్కి యచ్చటికిఁ బోయి యొక పొదరింటికి సమీపముననున్న ఫలకముమీఁద గూర్చుం డెను.

అంతలో నొక మాలరి (తోటలో పనిచేయు ఆమది) మెల్లమెల్లఁగా మన న్యాయవాదిని సమీపించి లకోటా చేసియున్న యొకజాబు నతని కందించి వెడలి పోయెను ఉత్తరమును జదువుకొనినప్పు డాతనిముఖ మున నానందమును బెదవులపైనఁ జిఱునగవును గాన వచ్చుచుండెను. దానిలో నేమియున్నదో?

---

చతుర్థతంగము

"రసికవరా!

సృష్టిసౌందర్యమును జూచి యానందతరంగము లలో నోలలాడుచున్న మీ సౌఖ్యమునకుఁ గొంచెము సేపు భంగము గలిగించుచున్న నన్ను క్షమించి నా విన్నపము నాలకింప వేడెదను చిరకాలము నుండి నేను పురుషుల స్వభావమును బరీక్షించుచుంటిని. పురు షులు సర్వసాధారణముగా స్వార్థపరులనియు, నీతిబల ములేనివారనియు, నాయనుభవమువలనఁ గనుఁగొంటిని. ప్రేమాభరితమగు తన హృదయమును నిర్వ్యాజముగ నొక పురుషునకర్పింప నేదేని స్త్రీతలఁచినచోఁ దదను గుణ్యమగు నిశ్చలప్రేమతో నా యమూల్యరత్నమును

గ్రహించు యోగ్యుఁడు నాకుఁ గొన్ని దినముల క్రింది వఱకుఁ గానవచ్చియుండ లేదు.

అయినను నాకృషి వ్యర్థము కాలేదు. ఉన్నతమగు మానసముచేతను, సుగుణసంపదలచేతను, నిరుపమానమగు పురుషరత్నమొకటి నాకంటఁబడినది. అతని యందుఁగల గుణరాజములు స్థూలదృష్టికి గోచరములు కాఁజాలవు కాని, అన్వేషణపరులకుఁ దెలియరాని రహస్యముండదు. ఆయన ప్రాయముగాని శారీరక సౌందర్యముగాని నన్నాకర్షింపలేదు. అతని గుణసంపద నా హృదయమును వశము చేసికొనినది. నన్నా పురుష పుంగవున కర్పించుకొనుటయే నామనోరథము. దీనికి వెనుక ముందు లేదు. రేపురాత్రికిఁ దమరు 'కృష్ణాధియేటరు' నకు వచ్చినచో నచ్చటఁ దమ కృపకుఁ బాత్రయగుటకై యీదాసి వేచియుండును.

ఒక జవ్వని."

అని యా యుత్తరమం దుండెను గణపతిరావా యుత్తరమును మరల మరలఁ జదివెను. చదివినకొలఁది నాతనికి మితిలేని యానందము గలుగసాగెను "ఈ యువతి విద్యావతియు రసజ్ఞయు నైనట్లు కానవచ్చుచున్నది బాహ్య సౌందర్యమును ధనమును నాసించు

స్త్రీలు విస్తారముగాఁ గలరు. కాని యిట్టి సుందరు లఱుదు. ఒకరియందుఁగల గుణములను నిజముగాఁ గనుఁ గొనువారు తక్కువ. నాసుగుణరత్నములఁ బరిశీలించు రత్నపరీక్షకురాలు నేఁడు దొరకెను. ఆమె నన్నెచటనో చూచి యుండును. నావర్తనమును వినియుండును. సాధారణులగువారిని లెక్కకుఁ దీసికొనని యాసుందరి నాయోగ్యతను సంపూర్ణముగ గ్రహించియే యిట్టి యుత్తరము వ్రాసినది!"

ఇట్లనుకొనుచుఁ గొలనుకడకుఁ బోయి నీటిలోఁ దన ముఖమును జూచుకొని చెమ్మటచేఁ దడిసియున్న నొసటిని గడిగి చేరుమాలుతోఁ దుడిచికొనెను. కొంత సేపైన పిమ్మట నింటికివచ్చి భోజనముచేసి నిద్రించెను. కాని కలలు తప్ప మంచి నిద్రరానే లేదు.

---

## పంచమరంగము

మఱునాటి యుదయమున మన న్యాయవాది తొమ్మిది గంటలవేళ బజారునకుఁ బోయి షాపులలో మంచివెలగల బట్టలనేకములు గొనెను. అంతటి వెల గల వస్త్రములను నాతఁడెన్నఁడు కొనియుండఁడు.

వర్తకు లాతని యానాఁటి యుదారభావమును జూచి లోలోన నబ్బురపడసాగిరి. ఆతని స్వభావమును బాగుగా నెఱిఁగిన కొందఱు యావనులు దారిలో నాతనిఁ జూచి 'నేఁడిదేమిచిత్రము' అని కనుసైగలు సేసికొనిరి.

ఆనాఁటి క్రొత్తదనమును గని హైమవతి, భర్త ముఖమును దేఱిపాఱఁజూచి "ఈదినము దుకాణములో వస్త్రములేవైన యింకను మిగిలియున్నవా?" యని చమత్కారము దోఁపఁ బలికెను.

"తొడుగుకొనుటకై వర్షకాలము వచ్చినదని బట్టలను కొనితెచ్చితిని" అని యాతఁడు ప్రత్యుత్తరము చెప్పెను.

హైమ:—ఈపిల్కు కమ్బాబు, ఇముగ్రిబట్టలు వర్షకాలమునకుఁ జాలమంచివే! ఈ అత్తరు బుడ్లు, సెంటు బుడ్లో?

గణ:— స్నేహితులెవరైన వచ్చినప్పుడుండవలెనని తెచ్చితిని.

హైమ:—ఇదివఱ కెన్నఁడును రాని క్రొత్తస్నేహితులు నేఁడు వచ్చువా రుందురు. కనుకనే తెచ్చితిరి!

ఈ చివరవాక్యము పలుకునప్పుడు హైమవతి దృష్టులు గణపతిరావు ముఖమునఁ జెదరక నిలచి యుండెను. అతఁ డామెచేసిన పరిహాసమును దెలిసికొనక పోలేదు. పెదవులపైన నటించుచుండిన చిఱునగవుచేత నామె చెక్కుటద్దములపైన నేర్పడిన గుంటలను నాతఁడు చూడకపోలేదు.

మఱియొక మాట నేదియును ననక గణపతిరావు పనిమిషమీఁద నవతలికిఁ బోయెను.

రాత్రి జాముప్రొద్దయినది. చర్చి (గుడి) మీఁది పెద్దగడియారము తొమ్మిది గంటలు కొట్టెను. 'కృష్ణా థియేటరు'లోని విద్యుద్దీపికల కాంతులు విచిత్రవర్ణశోభితములగు పర్దాలపైనఁబడి చూచువారికి కన్నులపండువు సేయుచుండెను. వెలగల వస్త్రములనుగట్టుకొని తళతళలాడు బంగారుచట్టములుగల సులోచనములనుబెట్టుకొని ముంజేతులపైన 'వాటర్ ప్రూఫు (Water Proof) ఓవరు కోట్లను' మడతచేసి వేసికొని నీటుగా నటునిటు జూచుచు యౌవనులు గుంపులు గుంపులుగా నాటకశాలలోఁ బ్రవేశించి కురిచీల నలంకరింపసాగిరి. ప్రేక్షకులను నెక్కించుకొని నాటకశాలకు వచ్చుచున్న మోటారుబండ్ల భాంభమారావమును, బగ్గీబండ్ల చప్పుడును,

లోపలివారికి విసుగుఁబుట్టించుచుండెను. అంతలో నేత్రాకర్షకమగు వేషముతో గణపతిరావును, అతనికంటె ముందే ఘుమ ఘుమ లాడు సువాసనయును, లోపలికి వచ్చెను. అంతకుపూర్వము వచ్చియుండిన సీటుకాండ్ర చూపులు సులోచనములలోనుండి యాగంతుకుని ముఖముపైనఁ బ్రసరించెను. వెంటనే వారొకరి ముఖము నొకరు చూచుకొని నవ్వుకొనసాగిరి గణపతిరావు వారి సైగలను జూడనట్లు నటించెను; కాని, తా నసాధారణముగా నాటకశాలకు వచ్చినందున వారు పరిహసించుచున్నారని తెలిసికొనక పోలేదు.

నాటక మారంభమయ్యెను. కాళిదాసుని కథానాయికయగు శకుంతల చెట్లకు నీరుపోయుచు సఖులతో సంభాషించుచుఁ బ్రదర్శించిన మాధుర్యముగాని, తపోవనముచు విడిచి హస్తినాపురమునకుఁ బోవునప్పటి కరుణారస ప్రధానములగు భావముల మార్దవము గాని, గణపతిరావు హృదయము నాకర్షింపలేక పోయెను. అతని దృష్టి మొదట ప్రేక్షకు లాండ్రున్న ప్రదేశమునకు దుమికి యచ్చట వెదుకసాగెనుగాని వారందఱు నాటకమును జూచుటయందు నిమగ్నలై యుండిరి. అతని చూపుల కొకరైనను జవాబిచ్చియుండలేదు.

తుదకు నాటకము ముగిసెను. కణ్వ పాశ్రమమునుండి భర్తృగృహమునకుఁబోయినశకుంతలతోఁబాటు నాటక ప్రేక్షకులుగూడ తమ తమ యిండ్లకుఁ బోవ వెడలిరి.

గణపతిరావు వందలకంటె వెనుకజిక్కెను. అతని చూపు లింకను వెదకుచునే యుండెను. నాటకశాల లోని దీపము లాఱిపోయినవి. ఆవరణములో నొకచోట మాత్రము మినుకు మినుకు మనుచు నొకదీపము గానవచ్చుచుండెను.

మన న్యాయవాది ద్వారముకడకు నిరాశతోఁ బోయి యటు నిటుఁ జూడఁగా, ఆవరణమున కవతలి మూల నొక చెట్టు క్రింద ముసుకుఁ గప్పికొనియున్న వా రెవరోతన్ను రమ్మని సంజ్ఞ చేయుచున్నట్లు కానవచ్చెను. ఆశాభరితమగు హృదయముతో నతఁడచ్చటికిఁబోయి యేమిమాటాడుటకుఁ దోచక నిలఁబడియుండెను.

"సుందరీ! నీగుణ సంపదకును, భావ్యౌన్నతికిని, నేను తగినవాఁడను గానని తెలిసియు నీ యాజ్ఞకు బద్ధుఁడనై వచ్చితిని. నీప్రసన్న వదనమునుజూపి నన్ననుగ్రహింపుము" అని యాతఁడు ముసుకుతోనున్న స్త్రీని వేడికొనెను. అంతనామె మెల్లఁగాఁ దన ముసుకును దొలఁగించెను. కొంతదూరముననుండిన దీపకాంతి యామె

ముఖమునఁ బ్రసరించెను. గణపతిరావు మోము వెల వెలఁ బాఱెను. కాళ్లు వడఁకసాగెను. కొంతసేపటికి ధైర్యము తెచ్చికొని యెండిన పెదవులను గొంతకష్టముతోఁ దెఱచి యనెను. "ఈకొంటెతనము చేసినది నీవేనా?". ముసి ముసి నవ్వుతో గడుసుదనము దోప హైమవతి యనెను, 'నేనే".

---

# అగ్నికుండము



## ప్రథమ రంగము

ఉ. కంటికి నిద్రవచ్చునె? సుఖంబగునే రతికేళి? జిహ్వకున్
వంటకమిందునే? యితరవైభవముల్ పదివేలు మానసం
బంటునె మానుషంబుగల యట్టి మనుష్యునకెంతవానికిన్
కంటకుఁడైన శాత్రవుఁడొకండు తనంతటివాఁడు గల్గినన్?

కాశీఖండము.

యశపంత సింహమహారాజునకుఁబుత్రుఁడగు బృథ్వీసింహుఁడు, శౌర్యసౌందర్యాలంకృతుఁడనియు, పర్షియా, ఈజిప్టు, టర్కీ వివిధదేశాటనార్జితానుభవకుశలుఁడనియు, ననేక భాషావిశారదుఁడనియుఁ బేర్వాసిగాంచియుండెను. ఈతని సోదరియగు రాజనందని యను నామె, రూపలావణ్యమునను, వాఙ్మాధుర్యమునను, స్వభావౌన్నతివలనను, నప్పటిరాచకన్నియలలో వన్నెకెక్కియుండినది. అపరాధ మొనర్చుట యన్న నామె కత్యంతాసహ్యము. నైతిక సమస్యలను గూర్చి యామె మహారాజుగారితోఁ బలుమాఱు వివా

దము నలుపుచుండెడిది. రాజనీతి మఱుఁగున సధర్మ కార్యముల నొనర్పఁగటిబద్ధుఁడై యుండిన తండ్రియుద్యమములఁ బెక్కువారు లాము మార్చియుండెను. చిన్న రాజపుత్ర సంస్థానమున కొక్క దానికి యువరాజై యశవంత సింహుని సేనాంగములో నున్నతోద్యోగమందుండిన ధర్మసింహుఁడను పురుషసింహుని శౌర్య సాహసాదులఁ బరికించి, వృద్ధికామునిగఁ దలంచి, మహారాజాతనికి దనముద్దుకూతు నిచ్చి పెండ్లి చేసెను. ఈదంపతుల యనురాగము కడుప్రశంసనీయమై యుండెడిది. ధర్మసింహుఁడు విశేషముగ యోధపురముననే నివసించుచుండుటవలనఁ బృథ్వీసింహునకును నాతనికిని గలిగియుండు ప్రేమాబంధములు మఱింత గట్టిపడెను. వేయేల? వారిమైత్రి భ్రాతృత్వముకంటె మించిపోయెనని చెప్పిన నందతిశయోక్తి యావంతయు నుండఁజాలదు. రాజపుత్రులవలెనే రాజపుత్రికల కిద్దఱకును బ్రాణస్నేహముండెను. పృథ్వీసింహుని ధర్మపత్నియగు దుర్గాదేవి, మిగులశాంత స్వభావము గలదియై, నీతివర్తనమున మిన్నగానుండెను. సామాన్యముగఁ బ్రపంచమున నగపడు నాడుబిడ్డమఱదండ్రునకు వలెఁగాక యీజవ్వను లిరువురకును, నొకరికై యొకరు ప్రాణము విడుచునంతటి

యన్యోన్యాను రాగమును, నిరువురకును సమానముగ సంస్కృత సాహిత్యజ్ఞానమును నుండెడివి.

ఒకనాఁడా యువతీమణు లిరువురు నుద్యానవనమున విహారమొనర్చుచుండ, దాసియొకతె రాజనందని చేతి కొకజాబు దెచ్చియందిచ్చెను. సంస్కృతమున వ్రాయఁబడియుండిన యాలేఖ నామె చదువుకొని యంపిన వారిని వెంటనే లోనఁబ్రవేశపెట్ట దాసి కాజ్ఞ యొసఁగెను. కొంతసేపటికి జీర్ణవసనధారిణి యొకర్తు ప్రవేశించుచుండుట గానవచ్చెను. ఆక్రొత్తవనిత యిరువదియైదింటికన్న నెక్కువ శరత్కాలములఁజూచియుండి నట్లగపడకపోయినను, శరీరమున వ్యాపించియుండిన పచ్చందనమును, తడిలేని పెదవులును, నామె విశాల నేత్రముల యొక్కయు, మందగమనము యొక్కయు, నెమ్మనము నాకర్షించు ముఖలక్షణమ్ముల యొక్కయు, సొగసునణచిపెట్టి చూచువారికి "కాలవైపరీత్య మిట్టి దశకుఁబాల్పడఁ జేసినదిగాని, యొకప్పు డీమె సౌందర్య రాశియై యుండనోపు"నను నూహానుబుట్టించుచుండును. రసపుత్ర నారీమణులను సమీపించిన పిదప నాక్రొత్త జవ్వని, వినయసూచకముగ నవనత శరీరయై, వారిద్దఱి నాశీర్వదించి, సమీపమున నొక్కచోఁ గూరుచుండెను.

రాజనందని యామె నాపాదమస్తకము పరీక్షించి "మీ పేరే" మనియడుగ "వ్రజవిలాసిని" యని యామెబదులు చెప్పెను.

రాజనం:—మీ దేయూరు ?

వ్రజ:— ఇచ్చటినుండి మూఁడుదినముల ప్రయాణమున నున్న విక్రమపురమే మాపురము.

రాజనం:—సంస్కృత మెచ్చట నభ్యసించితిరి ?

వ్రజ:—అశేషపాండితీ వైభవముగలిగి యుండిన మాతండ్రియే నాకు రెండు ముక్కలు నేర్పెను.

రాజనం:—మీకు వివాహమైయుండును కాదూ ?

వివాహము మాటవెలువడఁగనే, వ్రజవిలాసిని కనుదమ్ములనుండి ముత్తియములవలె బొటబొట బాష్పములు రాలసాగెను. అయినను నామె కన్నీరు దుడుచుకొని గొంతు సవరించుకొని "అమ్మా! ఈప్రశ్నకు మఱియొక సమయమున నుత్తరము విన్నవించుకొనెదను. నాకథ యిసుక పాతరవలెఁ దఱుగనిదై, జాలిఁ బుట్టించునదిగా నున్నది. అట్టి దానిని విన్నచో మీ మనములు విషాదమగ్నములు కాక మానవు. ఇప్పటికా విషయమున నన్ను క్షమింపుఁ" డని వినయముగఁ బల్కెను.

నాఁటినుండి వ్రజవిలాసిని యచ్చటనే నివసించు చుండెను. సంస్కృతమున నసామాన్య పరిచితిగల యావిదుషీమణి యనుదినమును సుప్రసిద్ధకవిరాజుల గద్య పద్యాత్మక కావ్యముల నాజవ్వానులకు వినిపించు చుండెను. ఆమె విద్యాసంపన్నతయు, సద్విషయ నిర తియు నచిరకాలము ననే రాకొమరితల హృదయమున గౌరవయోగ్యమగు నాస్థలము నాక్రమించెను.

---

## ద్వితీయరంగము

పృథ్వీసింహ ధర్మసింహు లిరువురును మహా రాజుగారితోఁగూడ నాఫ్ఘనిస్థానపు దండయాత్రకై వెడ లిపోయి యనేకమాసములు గడచినవి. దుస్సహమగు నీవియోగకాలము మేఘసందేశ రఘువంశాది గ్రంథ పఠనమునం గడచుచుండెను. మహాకవికాళిదాసుని కైత యెడ నత్యంతాభిమానము గలిగియుండిన యావ్రజవిలా సిని యక్కావ్యములలోని కథావిషయముల మిగుల రసావహముగ వర్ణించుచు నొక్కొక్కప్పుడందలి విశే షాంశములను సూక్ష్మదృష్టితో విమర్శించుచుఁ దన చెలుల నానందరస తరంగిత హృదయలఁ జేయుచుండె

డిది. ఒకనాటి సాయంతనమువేళ రాజపుత్రిక లిరువురును గృహారామమున విహారము సల్పుచుండఁ బచ్చని లేఁబచ్చికపై సాశ్రులోచనయై పడియుండిన వ్రజవిలాసిని వారికంటఁబడెను. రసపుత్రజనరాంద్ర యనుగ్రహమును, వారి మర్యాదయు, వారి యవ్యాజప్రేమయు, వ్రజవిలాసిని సౌందర్యమునకు మునపటికన్న నెక్కుడు వికాసము నిచ్చియుండె. తక్కిన యిరువురితోఁ బాటామెయు రాజకన్యవలె నగపడుచుండినది. అయినను నెట్టియాఱటకుఁ గారణములుండినను, నప్పుడప్పుడామె యేకాంతమునఁగూర్చుండి విలపించుచుండెడిది. నిముసమేనియు నెమ్మదినీయనంతటి కఠినభారమామె హృదయమునొత్తిపెట్టుచుండెను. తమ చెలికత్తెయొక్కయప్పటి దీనావస్థకు నెంతయు జాలిఁజెంది నాజవ్వను లిరువురును నామెకడకుఁబోయి కూర్చుండిరి. రాజనందని యామెతల నెత్తితనతొడపై నిడికొని, గులాబిపువ్వులఁ దృణీకరించు నామె చెక్కులను దుడుచుచు, నిట్లనియె "నీమనసులోని మాట మాకేల చెప్పవు? మమ్మునింకను లాతివారిగ భావించెదవా? మమ్మువదలి నీవొక్కదానవే యిట్లు దుఃఖాగ్ని సంతప్తవగు చుండుటఁ జూచి మేము భరింపఁ జాలము".

వ్రజ:—(డగ్గుత్తికతో) అమ్మా! నేను దురదృష్టవంతు
రాలను; నాకథ విన(గోరవలదు.

రాజ:— నీకు( దప్పుగా( దో(చదేని యొక్కమాట
యడిగెదను.

వ్రజ: —అడుగుము.

రాజ:— క్రొత్తదేదియునుగాదు ; నా(డు నేనడిగినదే;
నీకు వివాహమైనదా లేదా ?

వ్రజ:— నేనేమి ప్రత్యుత్తరము చెప్పుదును! ఇంకను
గాలేదు.

రాజ:— ఎవ్వరిదేని యనురాగ ఖడ్గము నీహృదయ
మున నాటియున్నదా ?

వ్రజ:— చెలీ! లేదు. దేవునితోడు.

రాజ:---అట్లయిన విన్నవోయియుండుటకు( గతమేమి?
అనురాగామృతమును జవిగొన నిచ్ఛగించు
చున్నావా ?

వ్రజ:--- లేదు; నాహృదయమున దుఃఖమునకు( దప్ప
సుఖమునకు( జోటులేదు.

రాజ:---అట్లయిన మే మనురాగమునకు( జో( టేర్పర
చెదము.

వ్రజవిలాసిని వారి నర్మోక్తిని గ్రహించి "చెలీ! దయచేసి యిప్పటి కీప్రసంగమును జాలింపు"డని బ్రతిమాలుకొనెను.

రాజ:--- ఇఁక మేము నీపరిణయ ప్రయత్నము లొనర్చెదము. దివాకరజయచంద్రు నెన్నఁడయినఁ జూచితివా?

వ్రజవిలాసిని దాని కుత్తరమొసంగక కన్నీరు గార్చుచు నివ్విధముగఁ జెప్పఁదొడంగెను.

"రాకుమారీ! నే నొక వ్రతముఁ బూని యున్నాను. ప్రతిన నెఱవేర్చుకొనుటయే నాజీవితోద్దేశము. దీనికొఱకే నేను జీవించియున్నాను. కానిచో, నాకుడిచిన యిడుములు నన్ని దినఱకే విషణ్ణహృదయగఁ జేసి యంత మొదించియుండును. నాజనకుఁడు విక్రమపురమునకు జాగీరుదారుగ నుండెను. ఆయనకు నేను తప్ప వేఱుసంతతిలేదు. కనుక నన్ను ప్రాణముతో సమానముగ గారామునఁ బెంచుచుండెను. నాకొఱకే యాయన యనేక సంవత్సరములు కృషిచేసి సంస్కృతము నభ్యసించెను. సంగ్రామవిద్యయందారి తేఱిన వాఁడు. పలుమారు రణరంగమున శత్రువుల వెన్నుఁజూచినవాఁడు. ఒకనాఁడసురస్యంధవేళ గోగణము లడ

వులమేసి గృహోన్ముఖములై వచ్చుచుండినవి. నేను మాయింటిద్వారముకడ నిలిచియుంటిని. అంతలో నీటగు పాగాను ధరించి యాయుధాలంకృత శరీరుఁడై వీర రసాన్వాదునివలె నాయెదుట నొక పురుషుఁడు వచ్చు చుండెను. నాకుఁ గడుఁగూర్చునావు 'మోహిని' యనునది పచ్చిక బయళ్లలో హాయిగ మేసి మరలివచ్చు చుండెను. దాని దూడ యటునిటు చెంగు చెంగున గంతులు వైచుచుండెను. విధివశమున నకస్మాత్తుగ నా దూడ యాపురుషుని పాదముల క్రిందఁబడి నలిగెను. ఆవు తన దూడ గతిఁజూచి తటాలున నాతనిపైకి దుమి కెను. శూరుఁడగు నారసపుత్రుఁడు పాఱిపోయినచోఁ బిఱికి తనము ప్రకటనమగునని కాఁబోలు వెంటనే కత్తిఁ దూసి యావుపై కెగిరెను. గోవును లేశమేని జంకక యార్భాటముసేయుచుఁ బెనఁగులాడసాగెను. నాకట్టెదు టనే నిముసమున నాపురుషుఁడు ధేనువు ప్రాణములఁ గొనెను. అంతలో నచ్చట వందలకొలఁది జనులు గుంపులుగూడి, చేసిన దుష్కార్యమున కాతని దూఱసా గిరి. మఱియొక నిముసమున సంధ్యావందనమునకై జలా శయమున కరిగియుండిన మాతండ్రి మరల వచ్చి చూచు వఱకు వాకిటియందు జనులు తండోపతండములుగ

నగపడిరి. గోవు ప్రాణావసానస్థితి యందు గిజగిజఁదన్ను కొనుచుఁ బడియుండుటయు, దూడకంట నీరుగార్చు చుండుటయు, నాయనకన్నులారఁజూచెను. ఆయన కంఠ ధ్వని వినఁగానే యావు దుఃఖావేశమును ప్రకటించు నట్లు బిగ్గరగా నఱచి జాలిఁగొలుపువడువునఁ దన దృష్టిని యజమానుని వైపుఁబఱపెను. మానాయన కత్యంత ప్రేమాస్పదమగు వస్తువులలో నాతరువాత నదియే ముఖ్యమైనదని మీరెఱుంగుదురుగాక! కనుక క్రోధా వేశపరవశుఁడై 'నాయావును గొట్టినవాఁడెవఁ'డని దిక్కులు ప్రతిధ్వనించునటులు ప్రశ్నించెను. యావ నుఁడు సిగ్గుచేఁదలవాల్చి ముందఱకువచ్చి "నేనే" యని పల్కెను.

మాతండ్రి:— అయినచో క్షత్రి నొక్కని మాఱొక్కన సిద్ధముగ నున్నదా?

రాజపుత్రుఁడెఱ్ఱవారిన మోముతో 'క్షత్రియుఁ డెవ్వఁడేని నన్నెదుర్కొన సిద్ధముగనున్నచో నా కభ్యంతరములే'దని బదులిచ్చెను.

అచ్చట నిలచియుండిన వేలకొలఁది జనులలో నొక్కని కైనను నారాజపుత్రు నెదుర్కొను ధైర్యము కలిగిన దికాదు. అదిచూచి మానాయనయే ఖడ్గహస్తుఁడై

యాతని నెదుర్కొనెను. అతఁడును గరవాలమును గైకొని ముందడుగిడెను. ఇట్లిద్దఱును బోరునకు డీకొనిరి. అయినను నిద్దఱిలో మాతండ్రి వయసు ముదిరినవాఁడగుటచేత వక్షమునఁ దగిలిన గాయమునకుఁ గ్రిందఁ బడఁగా నాయనను లోనికిఁగొనివచ్చిరి. ఆయన ముఖము పచ్చబారినను, నాగ్రహాగ్నికణములు చేటలఁ జెఱఁగినట్లు నేత్రములనుండి వెడలుచుండెను. ఏడ్చుచు నెదురుగావచ్చినిలచిన నన్నుజూచి, మాతండ్రి యందఱును నవతలకుఁ బొమ్మని కనుసన్నఁజేసెను. మేమిద్దఱ మేకాంతముగనున్నప్పుడాయన నన్నుఁజూచి "అమ్మాయీ! నీవు రసపుత్ర స్త్రీవికదా?" యనెను.

నేను:—అయ్యా! అవును.

తండ్రి:— రాజపుత్రులు ప్రతిజ్ఞా నిర్వాహణవ్రతులు గదా?

నేను:—అవును.

తండ్రి:—నాయావు ప్రాణముల నపహరించిన క్షత్రియునిపై నీవు పగతీర్చుకొనవలయును.

నేను:—అయ్యా! తమ యాజ్ఞనడిపెదను.

తండ్రి:—నాకుమారుఁడు బ్రతికియుండినపక్షమున నీ ప్రతిజ్ఞాభారము నీతలపైఁ బడియుండదు.

నేను:—తమయాజ్ఞను నెఱవేర్చి తీరెదను.

తండ్రి:—నీవట్లు నాకభయవచన మిచ్చెదవా?

నేను:—నిస్సందేహముగా.

తండ్రి:—నీవు ప్రతిజ్ఞనుచేసి చూపుదువని నేను నమ్మ వచ్చునా?

నేను:—నా ప్రాణములుండినచో నెఱవేర్చితీరెదను.

తండ్రి:—ఇదిగో. ఈకటారును గైకొనుము. ఎంత వఱకు నీవా క్షత్రియుని హృదయమును దీనితో వ్రయ్యలుచేయవో యంతవఱకు నీవు సర్వ సుఖ త్యాగినివిగా నుండవలయును.

ఈమాటలతో మాతండ్రియాత్మ పరలోకము ననుగమించెను. నేనును నాఁటినుండి యోగినీవేషధారి ణినై యాకటారు నడుపులక్రింద గుప్తముగ నుంచు కొని యాక్షత్రియ యావనునికై దేశమంతయు గాలించు చుంటిని. అనేకవత్సరముల వఱకు నొకప్పుడు జనా వాసములందును మఱొకప్పు డరణ్యములయందును, నివసించుచుఁ గ్రుమ్మరుచుంటిని. కాని యాపురుషుని జాడ యగుపడలేదు. ఒకనాఁడు నిర్జనప్రదేశమునఁ గూ ర్చుండి నాదురదృష్టమును దలపోసి దుఃఖించుచుండ, నాయావనుఁ డెచటనుండియో నావైపు నడిచివచ్చుట

గానఁబడియె. అతఁడు సమీపించి నన్నుగాంచి "నీవెవ"
రని విచారించెను.

నేను:— నేను దీనురాలనగు నొక బ్రాహ్మణిని. కరు
ణించి నాకేమైన నాహారమిడుఁడు.

క్షత్రి:—అట్లయిన నావెంటరమ్ము.

నేను లేచినిలచి యతఁడేమఱి యుండిన సమయ
మునఁ దటాలునఁ గటారుఁదూసి యాతనిరొమ్మునఁ
గ్రుమ్మితిని. అంతలో ననేకు లచ్చటికి వచ్చుచుండుట
కానరాఁగా భయాకులచిత్తనై కటారుఁ బాఱవైచి పరు
గెత్తితిని నాఁటినుండి మూఁడేండ్లవఱకు పర్వతారణ్య
ములలోఁ డాఁగియుంటిని. ఏనాఁటిలోనైననుబడి యుసు
రులువాయ పెక్కుమారులు నాకుఁదోచెను. కాని,
ప్రాణములు కడుతీపులు సుమా! ఇంక ముందేమేమి
యనుభవింప వలసియున్నానో కాని యిప్పటివఱకు
నాకుఁ జావురాలేదు. వనవాస జీవనము కొంతకాల
మునకు వెగటుగదోచి, జోధపురమువచ్చి, తమ దీనా
వన తత్పరత్వమును జెవులపండువుగ వింటిని. తమసేవా
భాగ్యమును బడసిన యానాఁటినుండియు భవత్కృపా
విశేషమున సుఖముగ జీవించుచున్నాను. ఇదియె
క్లుప్తముగఁ జెప్పబఁడిన నాయుదంతము."

ఈ వృత్తాంత మంతయును విని రాజనందని దీర్ఘ నిశ్వాసముతో "ఓహో! ప్రపంచమం దెంతటివార లున్నారు. అదియట్లుండె. నీకటూరాతని ప్రాణములం బాపియుండునా"? అనెను.

వ్రజ:—ఎక్కడనమ్మా? ఆతం డుతప్పించుకొనంగలైను. గాయము తప్పితగిలెను. పిమ్మటం గొంతకాల మునకట్టి యాకారమేగల యావనుం డొకం డడవిలో వేటాడుచు నాకగుపడెను. అతండో కాండో చెప్పంజాలను; కాని వారిద్దఱి రూప ములు నచ్చున గ్రుద్దినట్లొక్కతీరున నున్నవి.

---

## తృతీయ రంగము

ఈ సంగతులుజరిగి యనేకమాసములు గడచెను. వ్రజవిలాసినికథ విన్ననాంటనుండి రసపుత్ర నారీరత్నము లామెయెడ మునుపటికన్న నెక్కువప్రేమను, గనికర మును జూపసాగిరి. మున్నుచనవుచే నామె నప్పు డప్పుడు విసిగించుచుండిన యాజవ్వను లిపుడామెను సర్వదా యూఱడించుచుందురు. ఆకాశము మేఘాచ్ఛా దితమై గడునానంద దాయకముగనున్న యొకనాండు, రాజనందని "వర్షర్తు"ను గూర్చిన మనోహర వర్ణనము

గల పొత్తము నొకదాని విషయమునఁ బ్రశంసించి దానిఁ జదువఁగోరెను.

వ్రజ:---అది నిజముగా నమూల్యగ్రంథము చెలీ! నీ ప్రక్కనున్న యలమారునం దాపుస్తకమున్నది. కొంచెముతీసి నాకందిమ్ము.

వ్రజవిలాసిని యాగ్రంథమునందికొనివిప్పి, మొదటి పుట మరలింపఁగానే పుస్తకమామెచేతినుండి జారిక్రిందఁ బడెను. ఆపుట నలంకరించు చుండిన ప్రతిమ తన తండ్రినిజంపిన పురుషునిదిగ నామెకుఁదోఁచెను. దానిఁ జూచినతోడనే యామెకన్నులనుండి యగ్నిజ్వాలలు వెడలసాగె. లలాటమున ముడతలుపడెను. తనప్రతిజ్ఞ జ్ఞప్తికివచ్చెను. కాని యంతలోనే "యతనిప్రతిమ యిచ్చటి కేల వచ్చియుండును? ఆపురుషుని కీ రాకొమరితలతో నెట్టి సంబంధమున్నది? కృతజ్ఞతాభారమునకులొంగి నాప్రతిజ్ఞ నుల్లంఘింపవలసి వచ్చునా యేమి?" యను విచార పరంపరయామె మనస్సును వేధించెను. రాజ నందని తనచెలి మోమువంకఁజూచి "సఖీ! ఏల యీ యాగ్రహ"మని యడుగ వ్రజవిలాసిని మెల్లన "నేమియు లేదు, కొంచెమేదో మనోవైకల్యము తప్ప మఱేమియు లే"దని ప్రత్యుత్తరమిచ్చెను.

ఇదివఱకున్నది కాక నాటినుండి వ్రజవిలాసిని
కొక క్రొత్తవిచార ముద్భవించెను. 'కృతజ్ఞతాభారము
నన్నుఁ బ్రతిజ్ఞనుల్లంఘింపఁ జేయునాయేమి' యను
నదియేయది.

---

## చతుర్థ రంగము

పదునాఱుమాసములు పూర్తిగఁ గడచిన పిదపఁ
బృథ్వీసింహ ధర్మసింహులు లాఘనిస్థానమునుండి మరలిరి.
చక్రవర్తిసేనలాదండయాత్ర యందుఁజాల నిడుమలఁ
గుడువవలసి వచ్చెను. మార్గమధ్యమున మంచుగడ్డలు
కురియఁజొచ్చెను. పర్వతపు కనుమలు హిమమయములై
రాకపోకల నడ్డగించెను. వస్తుసామగ్రులు క్రమముగాఁ
దగ్గిపోయె. సైనికులు పస్తుండవలసి వచ్చెను. ఈస్థితి
గతుల లాభముగొని యాఫ్గనులు చక్రవర్తిసేనల నురు
మాడఁ జొచ్చినందున యువరాజగు మొహియుద్దీనుఁడు
భగ్నమనోరథుఁడై వెనుకకు మరలి రావలసివచ్చెను.

జోధపురము సమీపించిన కొలఁదిని, రస
పుత్రవీరు లిరువుర మనములును నాతురతతోడి సంతో
షమున మునింగెను. ఇన్నినాళుల వియోగము తరు

వాత లభింపనున్న సంయోగ సుఖాశ వారియానం
దమును మేరమీఱఁ జేసెను. రాత్రియనక పగలనక
మార్గాయాసమును దలంపక వారు వడివడిగఁ బ్రయా
ణము సల్పసాగిరి. వారికిద్దఱకు బలమైన గాయములు
తగిలియుండినను బ్రియజన దర్శనా భిలాష వారికి బాధను
స్ఫురింప నీయ లేదు. పృథ్వీసింహుఁడు తనమనోనాయకికై
అస్ఫహాను నగరపు కటారునొక దానిఁ దెచ్చెను. ధర్మసిం
హుఁడునునట్లే పత్నికై కాశ్మీర శాలువు నొక్కదానిఁగొని
వచ్చెను. ఇరువురును దమ వారినెప్పుడు చూతుమా
యను నుత్కంఠ చేఁ దొందరపెట్టఁ బడుచుండిరి.

రాజకుమారుల యాగమనవార్తవినిన రాకొమ
రితల సంతోషము వర్ణనాతీతమై యుండెను. శరీరములు
భూషణములతోను, పాపటలు ముత్తెఁపుఁజేరులతోను
నలంకరింపఁ బడసాగెను. వారి వదనారవిందములు
ప్రియవార్తా శ్రవణముచే వికసించెను. ఒకరి నొకరు
వేళాకోళము చేసికొనుటయు, మరల పరస్పరాలింగన
మొనర్చుకొను చుండుటయు, జరుగుచుండెను.

ఆశ్వీజమాసమున నొకనాఁడు యోధపుర దుర్గ
మునుండి వెడలు స్వాగతసూచక శతఘ్నినినాదములు
దిక్కులఁ బిక్కటిల్లఁజేసెను. పృథ్వీసింహుఁడు సురక్షిత

ముగ నాఘనిష్ఠానమునుండి మరలివచ్చె ననువార్త నగర మందెల్లెడల నల్లుకొనియె. రాకొమరిత లిరువురును పళ్లెరముల హారతిద్రవ్యముల నిడుకొని యంతఃపుర ద్వారమునఁ బ్రతీక్షించు చుండిరి. పృథ్వీసింహుఁడు సభ్యులొనర్చు మర్యాదలఁ గొనుచు నంతఃపుర ప్రవేశము చేయఁగానే దుర్గాదేవిభర్తకు హారతి యిచ్చెను. దంపతులచూడ్కు లన్యోన్యాలింగనము చేఁ దృప్తిఁబొందెను. శౌర్యగర్వముతో ధర్మసింహుఁడు మందిరాంగణము లోనికిరాఁగానే తుమ్ము వినవచ్చెను. ఎడమ కన్నదర సాగె. అంతలో హారతిబూని యత్యాతురముతో వచ్చుచుండిన రాజనందని కాలుజారి పళ్లెరముక్రిందఁ బడెను. ధర్మసింహుని మోము వెల్లఁబారె. రాజనందని ముఖకమలము వాడువఁజూపె. ఈ దుశ్శకునమున కర్థమేమైయుండును ?

---

## పంచమ రంగము

రసపుత్ర వీరులింటికివచ్చిన వార్తవిని వ్రజవిలాసిని వారిద్దఱను గురించియు నభివందన రూపముగ సరస పద్యావళిరచించి యుండెను. కనుక మరునటియుదయమున పృథ్వీసింహుఁడు కాల్యకృత్యముల నిర్వర్తించు

కొని తీటికగఁ గూర్చుండువేళ నామె యాతనిసమ్ముఖ
మునకువచ్చి కుశనిర్మితమగు చక్కనిపాత్రమున నా
కవితారూపకాభినందనపత్రిక నునిచి యర్పించెను.
పృథ్వీసింహుఁడెంతయు సంతసించి దానినంగీకరించె.
పత్రికయందలి కవిత్వమంత ప్రౌఢముగ నుండకపోయి
నను భావ సౌష్ఠవముచేతను, పొంగి పొరలు రసముచే
తను, నది మిగులరమ్యమై యొప్పారె. కవితారసలోలుఁ
డగు పృథ్వీసింహుఁ డాపద్యములఁ జదివి యానందించి
మేలుముత్తియముల హారము నావిదుషీరత్నమునకుఁ
బారితోషికముగ నొసంగెను.

అచ్చటినుండి వెడలి యాముగ్ధియ ధర్మసింహుని
కడకరుగు దెంచువఱకు నతఁడు సుఖాసీనుఁడై రాజనంద
నికి యుద్ధవార్తలు వినుపించు చుండెను. వ్రజవిలాసిని
దృక్కులాతనిపైఁ బ్రసరింపఁగనే యాశ్చర్య చరితమై
యప్రయత్నముగ వెనుకకుఁ దగ్గెను. ఆమెముఖము నవ
లోకింపఁగనే ధర్మసింహునిమోము సహితము వెల
వెలఁ బారెను. పెదవు లెండెను. కాలుసేతులు తడఁబడఁ
జొచ్చెను. వ్రజవిలాసిని వెనుకకుఁ దగ్గినది తగ్గినట్లె మరలి
పోయెను. ధర్మసింహుఁ డుత్సాహమంతయుఁ గోల్పోయి
మంచముపై నొరిగి హస్తద్వయముచేఁ గన్నుదోయి

మూసికొనియె. ఈ వికారదశను బరికించుచుండిన రాజ నందనియొక్క కుసుమకోమల గాత్రము చెమటయందు మునిఁగెను.

ధర్మసింహుఁడా దినమంతయు నల్లిమానముగఁ బరుండి శయ్యపై నిటునటుఁ బొరలాడుచుండెను. చిర కాల వ్యాధిగ్రస్తునివలె నాతనిముఖము వన్నె తఱిగెను. పగలీవిధముగఁ గడపి, రాత్రిమార్గాయాస వ్యాజమున నాతఁడు సత్వరమె నిదురించెను. పాపము! రాజనందని కా మనోవైకల్య కారణమేమియుఁ దోఁపలేదు. "వ్రజ విలాసిని దప్పిగొని యున్న దీయనరక్తమునకే కాదు గదా? నామనోనాథుఁడు నాజ్ఞాననిధియగు ధర్మసింహుఁ డంతటి కాఠిన్యమును వహించియుండుట సంభవ మగునా? అసంభవ మసంభవ"మని పలుమాఱు విత ర్కించుకొని తనచేష్టాచమత్కృతిచే నాతని మనోవ్యా ధిని దొలగింపనెన్నియో యత్నములొనర్చెను. కాని, వ్యర్థమయ్యెను. తుదకామెయు నిద్రాదేవతయొక్క యనివార్య ప్రభావమునకు లోనై కన్నవమూసికొనెను. రాతిరి చాలప్రొద్దుపోయినది. గగనకాంత యంధకార వసనముతోఁ దనవదనమును గప్పికొనెను. అప్పు డప్పుడు సారసపక్షియొక్క వ్యసనకరమగు ధ్వనియును,

దుర్గమునుగాచు రక్షకభటుల జాగ్రత్తోద్బోధకారావములును దప్ప మఱేమియు వినవచ్చుటలేదు. రాజనందని కకస్మాత్తుగా మెలఁకువవచ్చి చూడ ధర్మసింహుఁడు శయ్యపైనఁ గానఁబడలేదు. హృదయము భయవిహ్వలమయ్యె. విద్యుద్వేగమున లేచి ప్రజవిలాసినియుండు గది వైపునడచి తద్ద్వారమున నిలచి తొంగిచూడ నామె సంశయము యథార్థముగ మాఱెను. చూచుఁగదా ప్రజవిలాసిని ఖడ్గపాణియై నిలచియుండ ధర్మసింహుఁడు కేలుమోడ్చి యామెయెదుట నిస్సహాయునివలె మోకాళులపై నిలచియుండెను.

ఈదృశ్యము నవలోకింపఁగానే రాజనందనికి పిడుగుపడినట్లయ్యె;తల దిమ్ముపట్టెను; కాళులు తడఁబడఁ జొచ్చెను. నిశ్చేష్టయై, క్రిందఁబడుదునేమో యని యామె కనిపించెను. అయిననెట్లెట్లో తనగదికి మరలవచ్చి ముఖమున వస్త్రమును గప్పికొని పరుండెనేకాని యొక్కయశ్రు బిందువేనియు నామెనేత్రముల నుండి వెడలలేదు.

---

## షష్టమ రంగము

మరునాటి వేఁకువను పృథ్వీసింహుఁడు ధర్మ సింహునికడ కేఁగి చిఱునగవుతో "భయ్యా! నేఁటిదినము కడురమణీయముగ నున్నది. వేఁటకుఁ బోవుదమువచ్చెదవా?" యని ప్రశ్నించెను.

ఏదో విచారమున మునింగియున్న ధర్మ సింహుఁడు తలయెత్తి యుదాసీనతఁబూనియున్న ముఖము నాతనివైపు త్రిప్పి "ఏమంటివి?" అని యడిగెను.

పృథ్వీ:—వేఁటకుఁబోవుదము వచ్చెదవా?

ధర్మ:—అట్లెపోవుదము.

అంత నాశూరు లిరువురును గుఱ్ఱముల నాయత్తము చేయించుకొని మృగయార్థ మేఁగిరి. పృథ్వీ సింహుని వదనము కమలమువలె వికసించియుండి ప్రతి పాదన్యాసమునను నాతని జాగరూకతను జుఱుకుఁదనమును వెల్లడిచేయుచుండెను. కాని ధర్మసింహుని మోము విగతప్రాణునివలెఁ గళాహీనమై కన్పట్టుచుండెను. పృథ్వీ సింహుఁడనేకపర్యాయము లాతనిఁ బ్రసంగమునకుఁ బురికొల్పిచూచెనుగాని యత్నము కార్యకారిగాక తనమిత్రుని మనోవ్యథయట్లేయుండ, దానునుమౌనముతోనే నడి

చెను. ఇట్లు కొంతసేపు ప్రయాణముచేసి వార్లోక సర స్తీరమును జేరిన తరువాత ధర్మసింహుఁడు తటాలున నాగి, మిత్రునితోఁ "గడచినరాత్రి నేనొక ఘోర ప్రతిజ్ఞ చేసితిని" అని పలికెను. ఈమాట లనునప్పు డాతని నేత్రము లశ్రుపూరితములై యుండె.

పృథ్వీ:—(భయభ్రాంతుఁడై) అది యెట్టి ప్రతిన ?

ధర్మ:—విని యుందువుకదా వ్రజవిలాసిని యుదంతమును?

పృథ్వీ:—అవును.

ధర్మ:—ఎవ్వఁడామె తండ్రిని వధించెనో యాతని నరక గామిఁ జేయఁ బ్రతిజ్ఞవట్టితిని.

పృథ్వీ:—సెబాస్ ! నీవు నిజముగ వీరపురుషోచిత మగు ప్రతిన యొనరించితివి.

ధర్మ:— అవునదియట్టిదే; కాని నెఱవేరవలయును గదా! నీయభిప్రాయమేమి? అట్టివాఁడు కంఠము తెగనఱుకఁదగినవాఁడా కాఁడా ?

పృథ్వీ:—సందేహమేమి? అట్టి దుర్మార్గుని కంఠము మొండికత్తితో నఱుకఁదగును.

ధర్మ:— అవును. నేనును నట్లె తలంచుచున్నాను. ఏదేని కారణమువలన నే నాప్రతిజ్ఞను నిర్వహింపలేక పోయితినేని నీవాకార్యమును జేసెదవా ?

పృథ్వీ:—ఆహా! సంతోషపూర్వకముగఁ జేసెదను. నీవాతని నెఱుంగుదువుగదా?

ధర్మ:—బాగుగ నెఱుంగుదును.

పృథ్వీ:—అట్లయిన నాసత్కార్యము నన్నే చేయనిమ్ము. పాపము నీ కాతనిపై జాలిపొడము చున్నట్లున్నది.

ధర్మ:—మంచిది; కాని జ్ఞప్తియందుంచు కొనుము. అతఁడు మంచి యదృష్టవంతుఁడు. పలుమారులు మృత్యుముఖమును దప్పించుకొన్నవాఁడు. కనుక నీహృదయమును కఱఁగించినను గఱఁగింపఁగలఁడు. అతని యమసదనమునకుఁ దప్పక పంపెదనని శపథముచేయుము.

పృథ్వీ:—నేనాతనిఁ గనికరింపను. దుర్గతోడు! ఆతని రక్తముచే నాకరవాలపు దాహము దీర్పక విడువను.

ధర్మ:—మన మిద్దఱముగలసి యీదండ యాత్రను నడుపుదము. నీచేసిన వాగ్దత్తమును క్రియారూపమున నొనర్చెదవుగదా?

పృథ్వీ:—ఏల యీప్రశ్న? నేను క్షత్రియుండను గానా? ఒక మారువచన మిచ్చిన తరువాతఁ

ప్రాణములుపోయినను నన్నమాట నెఱవేర్చిగాని యూరకుండను.

ధర్మ:—తప్పక యట్లేచేయుదువు గదా ?

పృథ్వీ:—తప్పక యట్లేచేసెదను.

ధర్మ:—అతఁడొకవేళ నీమిత్రుఁడై యుండుట తటస్థించినచో.

పృథ్వీ:— (ధర్మసింహుని ముఖమును బరీక్షించుచూపులతోఁజూచి) మిత్రుఁడైనచో నా ...

ధర్మ:—అవును. అతఁడొకవేళ నీబంధువు కావచ్చును. అప్పుడో?

పృథ్వీ:—(ఉత్సాహముతో) ఎవఁడైనను గానిమ్ము. నాసోదరుఁడైనను ప్రాణములతో వానిని వదలను.

ధర్మసింహుఁడంతవారువముడిగ్గి వాడినమోముదమ్మితోను, ప్రకంపితములగు నోష్ఠములతోను, నడుమనున్నకటారు విప్పినేలపైఁబెట్టి, పృథ్వీసింహునితో నెలుఁగెత్తిచెప్పెను."పృథ్వీసింహా ! జతనముననుండుము. ఆచెనఁటి మనకు దొరకనే దొరకెను !"

పృథ్వీసింహుఁడు త్రుళ్లిపడి యటునిటుఁజూచెను. గాని ధర్మసింహుఁడు తప్ప మఱెవ్వరును నాతనికి దృగ్గోచరులు కాలేదు.

ధర్మ:—నీకటారు నొఱనుండి లాగుము.

పృథ్వీ:—నాకాతఁడు పొడకట్టనేలేదు.

ధర్మ:—అతఁడు నీయెదుటనేయున్నాఁడు. ముష్కరుఁ
డగు నాహంతకుఁడు ధర్మసింహుఁడే.

పృథ్వీ:—(బెదరి) ఆ! అంతటి కటిగుండెయా!

ధర్మ:—క్షత్రియుఁడవేని ప్రతినఁబాలించుకొనుము.

ఈవాక్యము చెవినిబడఁగానే పృథ్వీసింహుఁడు నడుమునకు బిగింపఁబడియుండిన కటారును తెప్పపాటున దూసి, విద్యుత్కాంతులతో మెఱపించి, దాని ధర్మసింహుని రొమ్మునఁగ్రుమ్మెను. రక్తము చిమ్మనగొట్టము నుండి వెడలునట్లు ప్రవహింపసాగెను. ధర్మసింహుఁడట్టి స్థితియందు నేలపైఁబడి యుండి మంద స్వరముతో నిట్లనియె. "పృథ్వీసింహా! నేను నీకెంతయుఁ గృతజ్ఞతాబద్ధుఁడనై యున్నాను. నీవు నిజమగు వీరశిరోమణివి. నీవు వీరపురుషోచిత ధర్మమును బురుషోచితముగ నెఱవేర్చితివి!!"

పృథ్వీసింహుఁడీమాటలను విని, నేల పయిఁబడి విలపింపఁదొడఁగెను.

---

## సప్తమరంగము

చదువరులారా! నేఁడు రాజనందని సహగమనము చేయనున్నది! ఆమె శరీరము వివిధాలంకార శోభితమై యున్నది! పాపట ముత్తియముల హారములతోఁ గప్పఁబడి కానవచ్చుచున్నది! ముంజేతిని వైవాహిక కంకణ మమరియున్నది! పాదమున నెఱ్ఱనిలత్తుక యొప్పుచున్నది. శోణచేలముల నామె కైసేసినది! ఘుమ్మఘుమ్మను నెత్తావులామె దేహమునుండి వెడలి వాతావరణము నాక్రమించినవి. పరలోకగమన ప్రయాణమున కామెసేసికొనిన సన్నాహములను మీామనో వీధియందుఁ దిలకింపుఁడు!!

ఆమె ముఖము సంపూర్ణ చంద్ర బింబమువలెఁ దేజో వంతమై చూచు వారి మనముల భక్తిభావపూరితములుగఁ జేయుచున్నది.

ప్రేమాతిరేక మామె నున్మత్తగఁజేసినది. ఆమె దృగాకాశమునుండియధ్యాత్మిక తేజముగురియుచున్నది. ఆమెనడక యెంత గంభీరముగనున్నది! తనప్రియకాంతు నొడిలో నిడికొనివచ్చి, మంచిగంధముతోను బరిమళములఁ జిమ్ము మూాలికలతోను, సాంబ్రాణి

తోను జేర్పఁబడిన చితిపైఁగూర్చుండుచున్నది! చూ డుఁడు!! చూడుఁడు!!!

ఈ విషాదాంత దృశ్యమునుఁజూడ నగరవాసు లందఱుగుంపులుగూడుచున్నారు. వాద్యములు మ్రోగు చున్నవి. పుష్పవృష్టి గురియుచున్నది!! ఇవ్విధముగ నావీరపత్ని చితినెక్కఁ బఱతుపృథ్వీసింహుఁడు పఱువున వచ్చి హస్తద్వయమును మోడ్చి 'నారీరత్నమా! నాతప్పుమన్నింపు' మని వేడెను. 'క్షమింపవలనుబడదు. నీవొక రసపుత్రయగువనుని యుసురులుగొన్నావు. నీకును నట్టి యకాలమృత్యువే ప్రాప్తించు'నను ప్రత్యుత్తరము వినవచ్చెను. అంతలో నగ్నిజ్వాల లాకసమునంటి మండెను. జయజయారావములు హెచ్చెను. సంధ్యా రాగ మస్తమయ భానునివలె నగ్నిజ్వాల లందామె వదనము ధాళధళ్యముతోఁ బ్రకాశించెను. కొంచెము సేపటిలో నచ్చట బూదిరాసి తప్ప మతేమియు నగ పడలేదు.

ఆహా! ఎట్టి ధార్మికోదాహరణము! ఎట్టి విషా దకరమగుకథ! అబ్బబ్బా! అపరాధఁపు టగ్నియెంత తీక్షణమైనది! దానిజ్వాలలెంత ప్రాణోపద్రవ కర ములు! ఒకయపరాధమెన్ని ప్రాణముల ద్రింగెనో

చూడఁడు? రాజవంశజులగు నిద్దఱు యౌవనులును, నిద్దఱులావణ్యవతులును నీయగ్నికుండమున నాహుతులైరి. ఏలయన, నీపనిజరిగిన యేడువారములలోనే పృథ్వీసింహుఁడు సైతము ఢిల్లిలోఁ జంపఁబడుటయు దుర్గాదేవి తనయుసురులఁ జిఱియను యజ్ఞవేదికపై బలియిడి భర్తననుగమించుటయు సంభవించెను. మహాపతివ్రతయగు రాజనందని శాపముఫలించెను. వ్రజవిలాసిని యేమయ్యెనో నేఁటివఱ కెవ్వరును నెఱుంగరు.

---

# నాఁడు నీపంతము! నేఁడు నాపంతము!

## ప్రథమరంగము

చ. ధరను బరోపకార సుకృతంబును బోలవు పుణ్యముల్ మనో
హరతర వస్తువు ల్గువలయాత్ములకన్నను గల్గవెవ్వియుఁ!

భర్తృహరి

శ్రీరామసుందరుఁడు పాటలీపుత్ర వాసియగు నొక యౌవన న్యాయవాది. అతఁడు, శారీరిక మానసికాది సర్వశక్తులను వాగాడంబరమునఁ బ్రకటించుచునాగరకసంఘములలో నగపడు ప్రాయంపు యువకులవంటి వాఁడుగాఁడు. అతఁ డుత్సాహ భరితుఁడు; చెప్పుటకన్నఁ జేయుటయం దెక్కువ యాసక్తి కలవాఁడు. తాను మనఃపూర్వకముగ నమ్మిన తత్త్వముల నాచరింపక వదలుటగాని, స్వార్థపరాయణత్వముచేతఁ దన యభిప్రాయములను మార్చుకొనుటగాని, యాతఁడెఱుఁగఁడు. పలుకార్యములం దొక్కపుడే ప్రవేశించుట యాతనికిసరిపడదు. పదిపనులలో దిరుగువాఁ డొకకార్యమునేనియుఁ బూర్తిగనెఱవేర్పుట యరుదు. పదిసంఘముల కార్యదర్శిగను, పదిసభల

కర్తవ్యత్పరుఁడుగను నుండు మానవుఁడు క్రియాపూర్వక ముగఁ దనవిధుల నెఱవేర్చుననునాశ, విచారశూన్యు లగు వారికుండిన నుండవచ్చునుగాని దూరదృష్టి గల వాఁ డెప్పుడును నట్టియాశకుఁ జోటియ్యఁడు. అటువంటి వాని యావచ్ఛక్తియు వ్యాగ్రూపమున నెగిరిపోవును. మన న్యాయవాది యీరహస్యమును బాగుగ గ్రహించినట్లుఁ దోచెడిని. అతఁడు నిమ్నజాత్యుద్ధరణమునకై చిన్న సంఘము నొకదాని స్థాపించి, తనకుఁదొరకు విశ్రాంతి సమయమునఁ దనయాదాయములోని యొకభాగమును, నా సత్కార్యమున కర్పించువాఁడు. సాయంతనము న్యాయస్థానమునుండి యింటికి వచ్చినతోడనే యల్పా హారము భుజించి, తన ద్విచక్రికను(బైసికలు) బయటికిఁ దెచ్చి, పురపరిసరమునమున్న గూడెములకుఁ బోవును. పోయి, యచ్చటి హీనదశావశులతోఁ గూర్చుండి, వారి బాగోగులనుగూర్చి సంభాషించుచు, నీతివర్తనమును గూర్చి వారికుపదేశించును. వారి బాలురరప్పించి, బుజ్జ గించి యేమైన ఫలాహారముల నొసంగును. ఆదివారము గాని, మఱి యేదేని విశ్రాంతిదినముగాని, వచ్చినప్పుడు, యక్షిణీదీపము (మాజికులాంతరు) సహాయమున వారికి వినోదముగలిగించును. శ్యామసుందరుని యీ సహాను

భూతి సుమారొక సంవత్సరకాలముననే యాప్రాంతము లందు వసించుచుండిన హీనజాతులవారి జీవన విధాన నమున నెంతో మార్పుకలిగించెను. మృతజంతు మాంస మును భుజించుట మానిరి; మద్యపానాభ్యాసము పూర్తిగఁ బోకపోయినను, దత్పానమూలమున జరగు నేరముల సంఖ్యక్రమముగా క్షీణించుచుండినందున నా రక్షకపర్యవేక్షకునకు(పోలీసు ఇనస్పెక్టరుగారికి) మాత్ర మిబ్బందిగ నుండెను.

మన న్యాయవాది, అంటరాని తరగతుల వారి యందుఁ గ్రమముగా భ్రాతృభావము నెలకొల్పెను. ఆప్రాంతములనున్న మూఁడువందల గ్రామములలో నివసించు నాలుగువేల యంత్యజులపైనను, నతనికి భ్రాతృ ప్రేమ కలిగియుండె. వారి యిండ్లలోని వివాహములకుఁ బోయి, తాంబూలముఁ గొనుచుండు వాఁడు; వారిలోఁ గలిగిన వివాదముల నాతఁడే న్యాయముగఁ బరిష్క రించువాఁడు; వైద్యశాస్త్రమం దించుక ప్రవేశము గల వాఁ డగుటచేత సామాన్యస్థితులయందుఁ దానే వారి కౌషధముల నిచ్చును. నిరుపేదలగు వారికిఁ దన స్వంత ద్రవ్యముతోఁ జికిత్స చేయించుచుండును. అయినను, సాధారణముగ నిట్టి స్థితులందు నాతని యాదరణమే

వారిని సంతృప్తమనస్కులఁగఁ జేయుచుండెడిది. పరోప
కారమున, స్వార్థరహితమగు ప్రేమయు, స్వజాత్యభి
మానమును, నెంత యవసరములుగ నుండునో, ద్రవ్య
సహాయ మంత యవసరముగ నుండదు. శ్యామసుంద
రుని యిట్టికృషివలన వారాత్మ గౌరవము నేర్చుకొనిరి.
ప్రథమమునఁ గొందఱ భూస్వాములకు వారియం దుద
యించిన యీ మార్పు కోపకారణ మయ్యెను; కాని
చేయునదేమియు లేక యూరకుండిరి. ఆరక్షక శాఖోద్యో
గస్థులువారిపై నొక కన్నునిచియే యుండిరి. కాని,రిక్తులగు
వారి నేమియుఁ జేయజాలకపోయిరి. ఇవ్విధముగ మన
న్యాయవాదికి వారితోడి సంబంధము ప్రబలము కా
సాగెను. తుదకొక్కనాఁ డతఁడు నాయకునింట జరిగిన
వివాహ సందర్భమున, వారితోఁ గలసి భుజించెను.

---

## ద్వితీయ రంగము

శ్యామసుందరుని భార్యపేరు కమల. హిందూ
స్త్రీలకు సహజమగు పతిభక్తి యామెకును మనఃపూ
ర్వకముగ నుండెను. విద్యాసంపదయంతగా లభింపక
పోయినను, కమల, భర్తసహవాస ఫలితముగ సాం

ఘిక దేశీయ సమస్యలనైజము లెఱింగియుండెను. మానవ జన్మకు సహజమగు దౌర్బల్యమనుఁడు; లేక యామె స్వభావ దోషమనుఁడు. ఎట్లయిననేమి, యామెకు సహనశక్తి విశేషము లేదు. వాక్పారుష్యము నామె యెఱుఁగదు; ముక్కోపియుఁగాదు. అయినను, హృదయమునఁ గ్రుచ్చుకొను మాటగాని, యెకసక్కెముగాని, యామెకత్యంత బాధకరముగ నుండును. ఇట్టి మాటల నెవరేనియనిన వినును; ప్రత్యుత్తర మిచ్చుట నామెయెఱుఁగదు. కాని యిట్టిస్థితులందు లోలోనఁ దలపోయుచుఁ గృశించుట యామెకలవాటు. శ్యామసుందరుఁడామెస్వభావమునుఁ బూర్తిగ నెఱింగిన వాఁడగుటచే నట్టిమాటల నెన్నఁడును నోట వెడలనీఁడు. కొన్ని సంవత్సరములక్రింద క్రొత్తగా న్యాయవాదిత్వ వృత్తి నవలంబించిన దినములలో నాతని యాదాయము కడు స్వల్పముగ నుండెను; అనుదినవ్యయములకే శ్రమయగుచుండెడిది. ఆదినములలో నొకనాఁడు, పగలంతయు న్యాయస్థానమునఁ బనిచేసి, యాతఁడు సాయంతనమగు వఱకు నుత్తచేతులతో నింటికి వచ్చెను. ఆనాఁడేదో పండుగైనందునఁ గమల, యుదార హృదయముతో నయిదు రూప్యముల వెచ్చించి పులగము వండి బీద

సొదలకుఁ బెట్టెను. ఇంటికిఁ దానువచ్చువఱకీ యసమయ యౌదార్యముఁగని, కఠినభాషణములతో భార్యననెను. "నేను డబ్బుడబ్బునకుఁ గష్టపడుచుండ, నీవిల్లు గుల్లఁ జేయుము. అంత యౌదార్యముండిన, వివాహము నాఁడే తండ్రితోఁజెప్పి యొకమహారాజు చెట్టఁబట్టవలసి యుంటివి." ఆమాటలకు మాఱువల్కక, కమల తలవాల్చెను. తాఁజేసినపనికై భర్తక్షమాపణమైనఁ గోర లేదు. కాని నాఁటినుండి యాఱుమాసముల వఱకు జ్వరముచేతను, హృదయ దౌర్బల్యము చేతను మంచ మెక్కియుండెను. ఈవిధముగ శ్యామసుందరుఁడు ముందునోరెత్తకుండఁ బాఠము నేర్చుకొనెను.

అదియట్లుండె. మనన్యాయవాది యానాఁడు గూడెమున నాయకునింట భుజించినవార్త రెప్పపాటు కాలమున పట్టణమందెల్లెడ నల్లుకొనెను. మఱునాఁడు, కమలగంగానదికి స్నానమునకై పోయెను. ఆనాఁడు సోమవత్యమావాస్య. పురమునందలి ధనికురాండ్రందఱు స్నానార్థము ఘట్టమునకు వచ్చిరి. కమల మోము ను జూడఁగనే వారొకరితో నొకరు గుసగుసలాడ నారంభించిరి. గొప్పయిల్లాలుగ నగపడునొకయువిద ప్రక్కన నిలచియుండిన మఱియొక వనితతో "చూచి

నానమ్మా ఆదొరసాని గారిని? భర్తమాంసిగ కూడుఁ దినుచుండ భార్య గంగా స్నానముఁ జేయవచ్చినది." యనెను. ఆమాటలు శూలములై హృదయమున నాట కమల విషాదముచేఁ దెలివిలేనిదై తత్తఱ పడసాగెను. ఎవరో నిశితఖడ్గాహతి హృదయ ప్రదేశమునఁ బ్రయోగించినట్లు దోఁచెను. స్నానముచేయకయే వెనుకకు మరలి యిలుఁజేరెను. సర్పవిషము ప్రతిరక్త నాళమున నిండెను. అన్నమువండి భర్తకు వడ్డింప నాతఁడుభుజించి న్యాయస్థానమున కేఁగెను. ధనవంతుఁడగు నొక కక్షిదారుఁ (పార్టీ) డానాఁడాఁతనినలలోఁ జిక్కుపడినందున, సంతోషపారవశ్యమున భార్య మనోవేదన నాతఁడు గ్రహింపనేరఁడయ్యె. సాయంతనమున నింటికి వచ్చి చూచువఱకు, ముఖమునిండ దుప్పటికప్పుకొని పరుండియుండెను. శ్యామసుందరుఁ డామెస్థితి నవలోకించి, నుదురదుముకొనుచుఁ బల్కెను. "కమలా! నేఁడిట్లు పరుంటి వెందుచేత? శరీరము స్వస్థముగ నున్నదిగదా?" కమల లేచి కూర్చుండి 'శరీరమున కేమి? బాగుగానే యున్నది. ఊరకే పరుంటి' నని బదులు చెప్పెను. కాని యంతటితో నాతనికిఁ దృప్తికలుగలేదు. మనసు స్వస్థముగనే యున్నపక్షమునఁ బెదవులపైని తాంబూలపు నెఱ్ఱఁ

దనమేది? వెంట్రుకల విరియఁబోసికొని యుండుటెందు చేత? ముఖమున విన్నఁదనమేల? నాకొఱ కెప్పటి యట్లు మంచుగడ్డఁ దెప్పింపకుండుటకుఁ గతంబేమి? ఇట్టి భావము లనేకము లాతనిమేదన్నునఁ బలువిడ సాగెను. ఉడుపులవిడిచి, యల్పాహారము గుడిచి, కొంత సేపు లోకాభి రామాయణమునఁ గడపెను. రెండు మూఁడు వినోదములఁ గూడ వినిపించెను. కాని యామంత్రముచే విషముదిగలేదు. కమల యాతని మాటలకు శిరఃకంపముఁ జేయుచుండినను, విషమహాత్వ మామె మనస్సు నచ్చట నిలువనియ్యలేదు. సాయంతన మయ్యె. శ్యామసుందరుఁడు వేళమైనంమున శకటము గొని యెల్లెక్లో వెడలెను. కాని కమల మనోవైకల్య మాతనిహృదయమున మెదలుచునే యుండెను. ఆనాఁడు గూడెమున నొకరియింట వివాహము. దూరమునుండి వచ్చిన పెండ్లికొడుకు పక్షమువాండ్రు మద్యపానము నకై తొందర పెట్టుచుండిరి. పెండ్లికూతురు పక్షము వాండ్రు దానికొప్పుకొనక నిరాకరించుచుండిరి. మన కథానాయకుని కృషివలన నిట్టి దురాచారము లనేక ములు గూడెములందు రూపుమాసెను. కాని మొద టిపక్షమువాండ్రు దూరమున నివసించు వారగుటచేత

నతని యుపదేశము లంతదూరము పోయియుండినవి కావు. శ్యామసుందరుఁ డచ్చటికిఁబోయి వారి వివాదమును విని మద్యపాన మక్కఱలేదనియే తీర్మానించెను. ఇట్టి వివాదసందర్భములలం దాతఁడు రాత్రి ౮, ౧౦, గంటలవఱకుఁ గూడ గూడెమున నుండవలసి వచ్చుచుండెను. కాని నాఁటిదిన మాతని మన మస్వస్థముగ నుండెను. కమలయొక్క విచారాక్రాంతమగు ముఖ మాతని కన్నులయెదుటఁ బొడకట్టుచుండెను. 'నా నోటినుండి యేదేని పరుషవాక్యము వెలువడలేదుకదా? నాకట్టియిచ్ఛ యుండ లేదు. అట్లయిన నీవిచారమునకుఁ గారణమేమైయుండును? అకారణముగ నామె మనస్సిట్టిస్థితికిఁ జాల్పడుట సంభవింపదు.' ఇట్టి యాందోళన మాతనిఁ దొందరపెట్టి వెంటనే యింటికి మరల్చెను.

---

## తృతీయ రంగము

శ్యామసుందరుఁడు భోజనముచేసి శయ్యపైఁ బవళించెను. కమల కీపూఁటఁగూడ నన్నము రుచిగనుండ లేదు. ముఖ మిప్పటికిని చిన్నబోయియుండెను. కొంచెము సేపాలోచించి యతఁడనెను. "కమలా! నీవెందు కిట్లున్నావు?"

కమ:—నా కేవిచారము లేదు.

శ్యామ:—నీశరీర మెట్లున్నది?

కమ:—శరీరమున కేమైనది? చూచుచున్నారుగదా? బాగుగఁగూర్చుండియే యున్నాను.

శ్యామ:—అట్లనిన నేనొప్పుకొనను. నీవిట్లు విచార గ్రస్తురాలవై కూర్చుండియుండుట కేదేనికారణ ముండి తీరవలెను. ఈ విషయముననిన్నడుగు నధికారము నాకు లేదా?

కమల:—మీరు నాప్రాణేశ్వరులు; మీకుఁ గాకపో యినచో నీయధికార మింకెవరికుండును?

శ్యామ:—అట్లయినచో నీదాపటికమేల? నేను నామ నోగతము నెన్నఁడైన దాచియుంటినా?

కమల:—(క్రిందుగఁజూచుచు) నేను మాత్రము దాచు చున్నానా?

శ్యామ:—ఇదివఱ కట్లు చేయలేదు కాని నేఁడు మా త్రము దాచుచుండుట నిక్కము. కన్నెత్తి నా ముఖము వంకఁజూచుము. స్త్రీలొక్క చూపున పురుషుల ప్రేమను బరీక్షింపగలరని చెప్పుదురు; కాని నీవింకను నాప్రేమయొక్క లోతుఁ గని పెట్టినట్లగపడదు. నీ యీ యుదాసీనత నన్నెం

తయు నస్వస్థతపాలు చేసెనని దృఢముగ నమ్మెను. ఇఁక నీవిచారకారణముఁ జెల్పకుం డిన నా యందు నీకు నమ్మకము లేదని తలం చెదను!

కమ:---(కన్నీటితో భర్తవంకఁజూచి) నాహృదయ శల్యము నూడఁబెఱికి వైచెదరా?

శ్యామసుందరుఁడు ఆిచ్చవడి కొంచెము సేపైన తరువాత భయకంపితమగు స్వరముతో నిట్లనెను. "కమలా! నీయీప్రశ్న నన్ను మిగుల బాధించు చున్నది. నేనును, నాసర్వమును నీయధీనము. నావిషయ మున నీవట్లు తలంపఁ గూడదు."

ఒకమాట యనఁబోయిన, వేఱొకమాట నోట వెడలెనని తెలిసికొని, కమలయనెను. "నేను మీప్రే మనుగూర్చి యొకనాఁడేనియు శంకించియుండలేదను సంగతి భగవంతుఁడెఱుంగును. నావిచారకారణమును వినినచో, నన్నెగతాళిచేయుదురేమోయని నేనట్లంటిని కాని వేఱుకాదు. నేఁజెప్పఁబోవుమాట లనఁదగనివని యెఱుఁగుదును. అందువలననే యింతవఱకు వానిఁ దాచి తిని. నామనస్తాపకారణ మొకమాటయేకనుక దాని రెండు మూఁడు మాసములలో మఱచియుందును; కాని

మీరిప్పుడు పల్కినవాక్యములు నామనోగతమును బయటఁబెట్ట నన్ను నిర్బంధించుచున్నవి. నాకు మీ మీఁద నమ్మకము లేదని మీరు తలంచిననాఁడు నాగతి యేమగునో విచారించితిరా? తమ యీవాక్యమే నన్ను తొందర పెట్టుచున్నది."

శ్యామ:---అవును. నీమనసులోనిమాట నిర్భయముగఁ జెప్పుము.

కమల:-మీరిఁకముందు నిమ్న జాతులవారితోఁ గలయుట, వారితో భుజించుట, మానుకొననలయును.

నిర్దోషియగు వాఁడు న్యాయాధిపతినోట శిక్షా నిర్ణయమును వినినతోడనే నిట్టూర్పువిడచునట్లు శ్యామసుందరుఁ డామాటల వినినతోడనే దీర్ఘనిశ్వాసము వదలి కొంచెము నేఫూరకపరుండి తరువాత లేచి యనెను. "మంచిది; నీయిష్టప్రకారము చేసెదను. అట్లు చేయుటవలన నాకు మనస్తాపముకలుగుట నిశ్చయము. అయిననుమానె. కాని యొక్కమాట చెప్పుము. ఇది నీకు స్వయముగదోఁచిన బుద్ధియా లేక యెవరిదేని యుపదేశమా?"

కమ:-తోడిస్త్రీలు నన్ను వెక్కిరించుచుందురు. నేను వారి వాక్యాలములపోటుల భరింపఁజాలను. వారి

నోళ్ళఁ గట్టివేయు నధికారము నాకులేదు. మీ మీఁద నాకధికారముకలదు. కావున మిమ్ము నిర్బంధించుచున్నాను.

శ్యామ:- సరి. మంచిమాట నీవుకోరినట్లు జరుగును.

కమల:- మఱియొక మనవి. నేను నామనసును విచ్చి మీ యెదుటఁబెట్టితిని. పురుషు లిట్టి యెగతాళిమాటలను లక్ష్యముచేయరు. స్త్రీలమగు మేము బలహీనలము. మామనస్సులు దుర్బలములు. పరుషవాక్యములు మామృదు హృదయములందు లోతుగ గ్రుచ్చుకొనును. మీరావిషయమున విచారపడవలదు. నన్నిట్టి పరుషభాషణముల నుండి తప్పించుటకై మీమనస్సునకు బాధకలుగుట నాకిష్టములేదు. నేనును నిట్టిమాటలకుఁ జింతనొందకుండ నలవాటు చేసికొనెదను. అది చేతఁగానిచో, పోడి స్త్రీలతోఁ గలయుటయే మానుకొనెదను.

శ్యామసుందరుఁడు భార్యను గౌఁగిలించుకొని యెను "కమలా! నాకాలమున నీవిట్టి పోటుమాటలఁ బడుట నాకిష్టములేదు. నీమెత్తని హృదయమున నొప్పిఁగలుగ నియ్యను. విచారము మానుము. ఏదీ యొకపాట!"

కమల సంతసించెను. ఆమె మోము వికసించెను. హార్మోనియముదీసి మందమును మధురమును నగు స్వరమునఁ బాడ నారంభించెను.

---

## చతుర్థ రంగము

శ్యామసుందరుఁడు పల్లెలకుఁబోక వారము దినములు గడచెను. నిమ్నజులగు సోదరులతో భ్రాతృభావమును స్థాపించుట వారికి పశుత్వముండి మానవత్వమును వివక్షించు యోగ్యతఁగల్గించుట. వారి నజ్ఞానగుహనుండి వెలుతురునకుఁ దీసికొనివచ్చుట యనునవి మన శ్యామసుందరుని జీవితోద్దేశములు. ఇట్టి సత్కార్యమార్గమున కడ్డముగ గోడ పెట్టఁబడినప్పు డాతనికి సంతాపమొదవుటయం దాశ్చర్యమేమికలదు? తన కర్తవ్యములఁ దాను యథావిధిగ నిర్వర్తించుచున్నానని తెలిసియుండువఱకే కదా మానవుండగువానికి నిజమగు నానందము లభియించుట. సంఘము నెడఁ దమకర్తవ్యము లేవియో యెఱుంగని మహానుభావులుగూడఁ బ్రపంచమునఁ గలరు. కాని యట్టివారిని మానవనామమున వ్యవహరించుటయే పొరపాటు. దుర్వర్తనము లలవడిన మనుష్యులు తాము నడచుమార్గము తప్పని తెలిసియుఁ

దన్మార్గమునుండి తమను కాపాడుకొనఁజాల కున్నారు. జూదరికెంత బోధించినను, నతనినెంత భయపెట్టినను, జూదమాడుట మానుకొనఁడు. మద్యపాన పరాయణుని జెయిలో నుంచినను, వదలినతోడనే మద్యవిక్రయగృహా మునకుఁ దారిదీయును. ఇది దుర్వ్యసనముల నైకము. సత్కార్యాచరణపు నైకముసైత మింతకన్న నెక్కువ శోధించు స్వభావము గలది. పగలంతయు శ్యామ సుందరుఁడు వ్యవహారకార్యము లందు మునిఁగియుండును. కాని సాయంత్రపువేళ రాఁగానే యతనిమనస్సెంతయుఁ బరితాపపడుచు, సాంఘిక కర్తవ్యమును వ్యక్తికొఱకు బలియిచ్చుట కమానుషయత్నముఁ జేయవలసి వచ్చు చుండెను. గృహారామమున నొంటరిగఁ గూర్చుండి, యంతరంగమున నీవిషయమునె తర్కించుకొన నపు డాతఁడు పలుమాఱు తనమనోదౌర్బల్యమును నిందించు కొనును. 'మఱేకార్యమైన నొనర్చెదగాని యీ పని మాత్రము చేయనని ఖండితముగ కమలతోఁ జెప్పుదు నా'యని పలుమారు లాతఁడు తలంచుకొనెను. కాని, యక్కటా! ఈమాటలామె మనస్సు నెట్టి వ్యసనము పాలు సేయునో! నాపైఁగల ప్రేమయందు నిమగ్నమై యున్న యాకమల కీవచనము లెంత బాధాకరములుగ

నుండునో! ప్రాణముకన్నఁ బ్రియతరమగు నో కమలా! నీవంటి యమూల్యరత్నమును గలిగియుండియు నేను-నన్ను దురదృష్టవంతునిగ భావించుకొంటినేని, యది నా బుద్ధిమాంద్యమే యగును! నేఁడు నేనింతటి మనస్తాపమున కధీనుఁడ నైతినని నీవెఱింగి యుండినచో, ముం దెంతటివాక్కాఠిన్యమునకును దప్పకఁ దలయొగ్గుదు వనుటయందు సంశయముండునా! ప్రపంచ మంతయు నేకగ్రీవముగ నిన్ను నిందించినను దోసిలి యొగ్గు-దువు! ఇంతటి ప్రేమకు మారుగ నీకిచ్చుటకు నాయొద్ద నేమికలదు? మానవునకు జాతీయధర్మము సర్వధర్మ-ములలో నుత్కృష్టతమమైనదే కాని, యొక్కొక్కప్పుడసామాన్య స్థితులందు సంఘమును వ్యక్తికొఱకు వదలవలసివచ్చును. అయోధ్యానగరమున వసించి, తనప్రజలకు సుఖము లభింపఁజేయుట శ్రీరామచంద్రుని సాంఘిక కర్తవ్యమై యుండియు, అతఁడు పితృవాక్యపాలనముకొఱకు దానిఁదృణీకరించెను! అయోధ్యవాసులెవ్వాని దమ భాగ్యదేవతగ భావించుచుండిరో యట్టి శ్రీరామునిఁబట్టాభిషిక్తునిఁ జేయుట దశరథునికి సాంఘిక ధర్మమై యుండియు, నతఁ డద్దాని వ్యక్తివిషయకమగు స్వీయధర్మమునకై విడిచిపెట్టెను!

అయినను, కమల, భర్తమానసికస్థితిఁ దెలియక యుండెననుట పొరపాటు. ఏరాత్రి యా దంపతులకుఁ బూర్వోక్త సంభాషణము జరిగియుండెనో యానాఁటి నుండియు 'నా ప్రాణేశుని మనస్సు నెంత నొప్పించితి' నను పరితాప మామె యంతరంగమునఁ బొడమని నిమిషమే లేదు. ఆమె కతని ముఖమున సహజకాంతి యొకింతయుఁ గన్పట్టలేదు; ఆహార నిద్రాదులయం దాతని తొంటి యాసక్తి ప్రకటనమగుచుండ లేదు. మాట లాడుచుండినఁ బరధ్యానముగ మాటలాడును. అతఁ డాడు ప్రతిపదమును దన మానసికస్థితిని దాచుట కొఱ కాతఁడు చేయుచుండిన ప్రయత్నమును వ్యక్త పఱచుచుండెను. నవ్విన తెచ్చి కోలు హాసముగ నుండెను. కమలకీ లక్షణము లన్నియు నద్దములోవలె స్పష్టముగ నగపడుచుండె. 'నేనెంతటి స్వార్థపరాయణు రాలను! ఎట్టి హీనాత్మను! తుచ్ఛురాలును, మర్యాద హీనయు, నగు నొక స్త్రీ చేసిన వేళాకోళమునకుఁ గినిసి, నాభర్త కెంతటి దారుణ సంతాపముఁ గల్గించితిని! నాకొఱ కాయన తన యంతరాత్మ నింత గట్టిగ నణచి పెట్టెనుకాని నేనొక సామాన్యమగు పరుషవాక్యంపు మనస్తాపమును సహింపలేక పోయితిని!' ఇట్లు చింతించి

చింతించి యా యువతి పలుమాఱు తనభర్తనా నిర్బంధ వాగ్దత్తమునుండి విడుదల చేయఁదలంచెను; కాని శ్యామ సుందరుఁ డామెకట్టి యవకాశము నొసంగఁడయ్యె.

---

## పంచమ రంగము

ఒకవారమువఱ కంత్యజసోదరులు శ్యామసుంద రునికై యెదురుచూచిరి. 'శరీర మస్వస్థముగ నైన నుండును; లేదా యేదైన వ్యవహారము విశ్రాంతి నియ్యకుండవలయును. ఈరెండును గాదేని గ్రామాం తర మేగియుండు'నని వారు తమ మనసుల సమాధాన పఱచుకొనుచుండిరి. వారము గడచిన తరువాతఁగూడ నాతనిరాక గానరానందున, వీపున దుప్పటులును, దలలఁ దెల్లనిపాగాలును, ధరించి కాళులకు మోటు పాపోసులఁ దొడిగికొని, భుజములపైనఁ గఱ్ఱలనిడి, గుం పుగ వెడలి వారు శ్యామసుందరునింటికి క్షేమ మారయవచ్చిరి. కర్తవ్యమును మానుకొనినందు కేదేనికల్పి తకారణముఁ జూపక తప్పదయ్యె. ఇంటిలో శరీర మస్వస్థముగ నున్నదని యాతఁడుబొంకెను. ఈమాట విన్నప్పటినుండి యాతని యింటికివచ్చుచుఁ బోవు చుండు నంత్యజ సోదరులకు విరామములేదయ్యె. ఒక

గ్రామమువాండ్రు వచ్చిపోయిన తోడనే మఱియొక గ్రామమువాండ్రు వచ్చుచుండిరి. మన న్యాయవాదియు మొదటివారితో బొంకిన బొంకులనే మరల మరల బొంక వలసివచ్చెను.

రెండవవారము గడచినను శ్యామసుందరు నింట శరీరమింకను సస్వస్థముగనే యుండెను. ఒకనాంటి సాయంత్రమున నతఁడు వాకిటనిలచియుండ, గూడెపు నాయకు లనేకులు సూర్యనారాయణ శాస్త్రిలుగారిని దీసికొనివచ్చి నిలచిరి. ఈవైద్యుఁ డభినవ ధన్వంతరి యని ప్రసిద్ధినొందియుండెను. మంత్రోచ్చాటనమైన తోడనే పిశాచములు పఱువిడునట్లు శాస్త్రిలుగారి దర్శనమైనతోడనే యెంతటిప్రాతరోగమైనను పలాయనము చెప్పును. మఱియుఁ, బలుమారు వ్యాధితోఁ బాటు రోగికూడఁ బోవుటగలదు. శ్యామసుందరుఁ డీవైద్యునిఁజూడగనే తత్తఱపడసాగెను. 'ఇప్పుడేమని బొంకుదును? గుట్టు బట్టబయలగు నవస్థ సంభవించినది. ఈదౌర్భాగ్యుల కీవైకుంఠవైద్యునిఁ దీసికొనిరావలయునను బుద్ధియేల పుట్టవలయును? ముందువెనుకఁ జూడక మృత్యుదేవతఁ బోలెవచ్చి వాకిటనిలచిన యీ వైద్యశిఖామణి నేమనవలయును?' నని విచారింపఁదొడఁ

గెను. కాని, విచారింప నవకాశమెక్కడిది? ఎవ్వరి నాతఁడు తనప్రాణముకన్న నెక్కుడుగఁ బ్రేమించు చుండెనో యట్టికమలకు నాతరుణమునఁ గొంచెము జ్వరము వచ్చిన నెంత బాగుగానుండునని యతనికిఁ దోఁపసాగెను!

వైద్యుఁడు వచ్చి "అయ్యా! తమభార్య రెండు వారములనుండి జబ్బుపడియుండిన వార్తవిన నాకెంతయుఁ జింతవొడమెను! మున్ముందుగ నాకీసంగతి తెలిసినచో, వ్యాధియింత దీర్ఘమైయుండదుగదా యని తలఁచినపుడు నాకుమఱింత విచారముకలుగుచున్నది. ఇంతకు, జబ్బేమిటి?"

శ్యామసుందరుఁడేమియుఁ దోఁచక, నటునిటుఁ జూచి యొడలుసర్దుకొని, తలగోకికొని, దగ్గి, తలవంచి, పల్కెను. "అవును. అవే, స్త్రీలకు సామాన్యముగా వచ్చువ్యాధులు. ఇప్పుడు తమ యనుగ్రహమున నారోగ్యము మరలవచ్చుచున్నది. డాక్టరుదొరసాని యౌషధమిచ్చుచున్నది. ఇవిపాశ్చాత్య నాగరకత దినములుకదా! ఈకాలమున నింగ్లీషువైద్యమందు జనులకెక్కువ విశ్వాసము; మఱియు నేవైద్యునియందు విశ్వాసముండునో

రోగికాతనివలననే యారోగ్యము లభించును! ఇదియే తమకు శ్రమయియ్యకుండుటకుఁ గారణము."

శాస్త్రి:—తమరు సెలవిచ్చినమాట నిజము. ఏడాక్టరు దొరసాని యుపచారము నడపుచున్నారు?

శ్యామసుందరుఁడు మరలఁ దలగోకికొని, యటు నిటుఁ జూచి చెప్పెను. "అదే; బోగను దొరసాని యుపచారము." ఈసందర్భమున మనన్యాయవాది తనకుఁ గల వ్యవహారజ్ఞానము నంతయు వినియోగింపవలసి వచ్చెను! నాఁటిదిన మాతఁడే చార్యాభగ్యుని మోమువలు నాతఁ జూచెనోకాని, ప్రతినిమిషమును నాతనికిఁ బ్రతికూలముగనే పరిణమించుచు వచ్చెను. ఇట్లు శాస్త్రిలుగారితో సంభాషించు చుండగనే మఱికొంద ఆంత్యజనాయకులు బోగను దొరసానిని వెంటఁబెట్టుకొని రానేవచ్చిరి! శ్యామసుందరుని మోము మఱింతవాడి పోయెను. ముఖవికాసము కప్పురమువలె నెగిరిపోయె. 'ఈదయ్య మిప్పుడే యొందుసకు వచ్చెరా దేవుఁడా!' యని దానిని మనసులోఁ దిట్టిపోయుచుండునంతలో నామె యాతని వాకిటనిలచెను. కుర్చీపై నుండిలేచి హస్తస్పర్శ మొనర్చి యామెనోటినుండి ప్రశ్న యేదియు వెలువడకే పూర్వమే లోనికిఁగొనిపోయి, యచ్చటఁ

గూర్చుండఁబెట్టి, కమలగదిలోనికేఁగి యామెతో నాలో చించెను "ఇప్పుడు పరీక్షవచ్చినది. నీశరీర మస్వస్థముగ నున్నదని బొంకితిని. అదివిని యీ తెలివిమాలిన వాండ్రు సూర్యనారాయణశాస్త్రిని బోగముదొరసానిని దీసికొనివచ్చినారు. దొరసాని చావిడిలోనున్నది. ఇఁకఁ గర్తవ్యమేమి?"

కమ:—అట్లయిన నన్నిపుడు జబ్బుపడుమనెదరా?

శ్యామ:—(నవ్వి) నీశత్రువులు జబ్బుపడెదరుగాక!

కమ:—శత్రువుల జబ్బు మనయక్కఱఁ దీర్పఁజాలదు. దొరసానిని దీసికొనిరండు. నేనుదుప్పటి బిగియఁ గప్పుకొని పరుండెదను.

శ్యామసుందరుఁడు దొరసానిని దీసికొనివచ్చు టకై యవతలకుఁబోయెను. కమల యాపాదమస్తక మును దుప్పటిఁగప్పుకొని మూల్గుచుండెను. దొరసాని వచ్చి, యుష్ణమాపకము (థర్మామీటరు) నోట నునిచి చూచి, నాలుకఁబరీక్షించి, ముఖలక్షణముల మార్చి యనెను. "వ్యాధి హెచ్చినది. మూర్ఛవలెనున్నది. బయ టికి జ్వరములేదు; కాని యది హృదయస్థమై యున్నది. తలనొప్పిగ నున్నది కాదూ?"

కమ:—తలపగిలిపోవుచున్నది.

బోగ:—ఆకలిలేదుగదా.

కమ:—మెతుకుఁజూచిన నసహ్యాము.

అంతఁ దొరసాని యౌషధపత్రము వ్రాసి యిచ్చి వెడలిపోయెను. తనకష్టమునంతకు మునుపే చేతవేసికొని యుండిన శాస్త్రిలుగారికి నక్కడనుండుట వ్యర్థముగఁ దలంచెను. శ్యామసుందరుఁడు వాకిటనిలచి యున్న తనయుపకర్తల కిడకుఁబోయి యనెను. "మీరం దఱు చాలశ్రమ చేసితిరి; నాభార్యశరీరము కుదురు చున్నది. మీకందఱకుఁ గృతజ్ఞతా వందనములు."!

వారందఱు వెడలిపోయిన తరువాత శ్యామ సుందరుఁడు లోనికేఁగి, నాఁడు జరిగిన చర్యనంతయుఁ దలంచి నవ్వసాగెను. పిమ్మట నిటువిచారింపఁదొడఁగె. 'చేయఁదగని కార్యము లేవికలవో, యవియన్నియు నేఁడు చేయవలసి వచ్చెను. ఇఁకనైన దేవి ప్రసన్న మగునా ?'

---

## షష్టమ రంగము

శ్యామసుందరుఁడు భోజనానంతరము శయ్య పైఁబరుండి నిద్రపోయెను. కాని కమలకు నిదురరా లేదు. ఆమెశయ్యపై నూరక పొరలుచుండెను. ఒక

మాఱు లేచి గదిలోఁ బచారు చేయును. వేఱొకమాఱు పుస్తకమును విచ్చి దీపము నెదుటఁ గూర్చుండును; కాని యేపనిఁ జేయుటకును దోఁచ లేదు. గాలిచే గదలు కొమ్మలుగల చెట్టుక్రిందఁ జంద్రకిరణములు నృత్యము చేయునట్లామె తలంపులు స్వస్థత నెఱుంగక నటు నిటుఁ బఱువిడుచుండెను.

“నేనతని నెంత బాధించితిని! అక్కటా! నేఁడాయన కెంత సంతాపము గలిగియుండును! జీవితమున నెన్నఁడును ననృతమాడియుండని నాప్రియభర్త నేఁడు నాకొఱకనృతవాదికావలసి వచ్చెను! ఆయన యొకవేళ యబద్ధమాడ సిద్ధపడియే యుండినచో, నేఁడొక రాజ్యమును సంపాదించియుండును! ఇట్టి సత్యవ్రతుని నే దుర్గతిపాలొనరించితిని! ఇట్టి కార్యము కొఱకొనా నేనతని సమభాగినిగఁ దలఁపఁబడుట! ఆయనయెడ సహానుభూతిఁ గల్గి యుండుట; సత్కార్యము లందాతనికిఁ దోడ్పడుట; సదుపదేశ మొనర్చుట; ఆపదలందు ధైర్యమిచ్చుట; ఇవి కదా నేను చేయవలసిన పనులు. వీనికిమాఱుగ నేనాసత్పురుషుని ననృతవాదిత్వఁపు వలలోనికి లాగుచున్నాను. ఈశ్వరా! నాతప్పు మన్నింపుము! అతఁడు వ్రాసిన యాసత్కార్యమున సాయ మొనర్చుట నాకు

విధిమైయుండెను. పాప మీఁగూడేఁపు వాండ్రెంత నిష్కపట స్వభావులు; ఎంత యుదారమానసులు! ఇట్టి వారి యభివృద్ధికై పాటుపడకుండఁగదా నాభర్త నాపి తిని! తెలివిమాలిన యొక స్త్రీమాటలకు నొచ్చు కొనిగదా నేనింతటి యకార్యమొనర్చితిని! అంతటితో సంతసింపక యతని నబద్ధమాడుటకుఁ గూడ బలవంత పెట్టుచున్నాను! నా యీదుష్కృత్యములఁ జూచియు, మూర్తీభవించిన గుణరాశియగు నానాథుని మనస్సెప్ప టివలె నున్నది! ఆయన, నన్నజ్ఞానురాలిగఁ దలంచి నా యీదౌర్బల్యముల నన్నిటిని దన ప్రేమాంబరమునఁ గప్పిపెట్టుచున్నాఁడు! నేనెట్టి సంకుచిత హృదయను. నేనాతనిపాదములఁ గడుగుటకైన యోగ్యురాలను గాను. దొరసానిని బాపివచ్చినప్పు డాతనిముఖము నలం కరించిన హాసమెంత పవిత్రమైనది! అది కేవలమునన్ను సంతోషింపఁ జేయుటకై జన్మించినదే! నాథా! నేనాపాద మస్తకమును బాపములతో నిండియున్నదానను! నేను పతితను! నాకు నీప్రేమాంబుధియందుఁ దావిమ్ము!"

ఇట్లు తలపోయుచు నామె తేఁగాలున శ్యామ సుందరుని ముఖమువంకఁ దిరిగిచూచెను. సంతోష ప్రదమగు నిద్దుర యాతని ముఖకమలమును వికసింపఁ

జేసియుండె. పెదవులపైనఁ జిఱునగవు ప్రకాశించు చుండెను. అతనిమోము దమ్మిఁ జూచినతోడనే కమల హృదయమునఁ బ్రేమతరంగ మొకటి యుద్భవిల్లెను. సముద్రమునవలెనే మానవహృదయము సైతము పొంగు చుండును. స్వచ్ఛమగు నా ప్రేమచేఁ బరవశయై, యామె భర్తవక్షము నలముకొనెను. నిద్రితుఁడగు యజమానుని సంపదల యథేచ్ఛముగ జూఱఁగొను దొంగవలె, సుషుప్తియందున్న భర్తయొక్క ప్రేమఁపు నిధిని కమల నిర్భయముగఁ గొల్లగొనుచుండెను. యజమానుఁడు మేల్కొనునేమో యను శంకచోరుని మనమును బాధించునట్లే, భర్త మేల్కాంచి యుండఁడు గదాయను సందియ మామెను వేధించుచుండెను. స్త్రీలయనురాగము నిరంకుశ స్వాతంత్ర్యము ననుభ వింపదు. లజ్జయు, సౌభాగ్యమును, స్త్రీల కన్నులఁ బైకెత్తనీయవు. తమ యుత్సాహమును, మోహమును, కృత్రిమములుగఁ దలంపఁబడునేమో యను భయము వారిపాదములకు శృంఖలములై యుండును!

సముద్ర ముప్పొంగినపుడు పగిలిపోయిన నౌకా శకలములును, నత్తగుల్లలును, పనికిమాలిన యితర పదార్థములును, తీరమునవచ్చి పడునట్లు కమలహృద

యమున నుద్భవిల్లిన ప్రేమసాగర తరంగమంతయు మున్నామె యంతరంగమున మెదలుచుండు శల్యములం బైకినెట్టివైచెను!

మఱునాఁడు శ్యామసుందరుఁడు న్యాయస్థానము నుండి యింటికివచ్చి కమలతో ననెను "నేను గ్రామాంతరమునకుఁ బోవలసియున్నది; రెండుమూఁడు దినములలో వచ్చెదను. నాకు సెలవా?"

కమ:— ఏగ్రామము పోయెదరు?

శ్యామ:— వ్యవహారమొకటి వచ్చినది; భాగల్పురమునకు.

కమ:— ఇప్పుడే వెడలవలయునా?

శ్యామ:— రేపే యచట నుండవలసిన దినము.

సాయంత్రత మూఁడుగంటలవేళ శ్యామసుందరుఁడు భాగల్పురమునకై వెడలెను. మూఁడుదినములలో వత్తునని చెప్పిన దానికిఁ బదులుగ నాల్గుదినము లచటనే గడచెను. అయిదవనాఁడు సాయంత్రము మూఁడు గంటలగువఱకుఁ బాటలీపుత్రమువచ్చి, యింటికిఁ బోవుచుండ, వీధిలో గూఢపునాయకుఁ డొకఁ డగపడ, "ఏమయ్యా! ఎటుఁబోవుచున్నా"వని శ్యామసుందరుఁ డాతనిఁ బ్రశ్నించెను.

నాయకుఁడు ఉలికిపాటుతోఁ దలయెత్తి చూచి పల్కెను. "నిన్ననే వచ్చెదరనుకొంటిమి; ఆలస్యమైన దేమి?"

శ్యామ:— నిన్న రా వలనుగలుగలేదు; అందఱు క్షేమమా?

నాయ:—తమ దయచేత నందఱును బాగుగనున్నారు. నేఁడు తమయింట గొప్ప సమావేశమైనది.

శ్యామ:— మా యింటనా? ఏమిటిసమావేశము?

నాయ:—దొరసానిగారు సభచేసినారు; మా యూఁడు వాండ్రందఱును వచ్చియున్నారు.

శ్యామసుందరుఁడు ముందు సాగిచూచువఱకుఁ బరిచితములగు ముఖము లనేకము లగపడెను. వారు చేయు ప్రణామముల కుత్తరమిచ్చుచు ద్వారముకడకుఁ బోవ జనులచట గుమిగూడియుండిరి. వారందఱును దమ స్త్రీలవెంటఁ గొనివచ్చియుండినవారు. శ్యామసుందరుఁడు చావిడిలోనికిఁబోయి వస్త్రములవిడచి తన రాకభార్య కెఱిగింపవలదని నౌకరుల కాజ్ఞాపించి తాను కిటికీలో నుండి లోపల జరుగు చర్యలఁ గనిపెట్టుచుండెను.

పందిరిలోఁ దెల్లనివస్త్రము పరువఁబడి దాని మీఁద మూఁడు నాలుగు వందల యాఁడువాండ్రు మోటునగలతోను, మోటువేషములతోను, గూర్చుండి యుండిరి. కొందఱు నవ్వుచుండిరి; మఱి కొందఱు మాట్లాడుచుండిరి. కమల, కేలఁ బళ్లెరముఁబూని వారలకందఱకుఁ దాంబూల మిచ్చుచుండెను. చిన్నపిల్లలకు మిఠాయియు, నాటబొమ్మలను, నిచ్చుచుండెను. తాంబూలము లైనతరువాత సంగీత మారంభమయ్యెను. నేఁడు కమలసైతము మోటుచీరఁ గట్టియుండెను. ఒక నగయైన నామె శరీరమున నగపడలేదు. యంత్ర సహాయమున నామె పాడి వారి కానందముఁ గల్గించుచుండెను.

ఈచర్య నంతయుఁ గనిపెట్టుచుండిన శ్యామసుందరుని యానందము వర్ణనాతీతముగనుండెను. సంగీతమైనపిమ్మట కమల పదునైదు నిమిషముల వఱకు గ్రామ్యభాషయం దాస్త్రీల కుపదేశమొనర్చి సభఁ జాలించెను. తరువాత నామె వారినందఱను మర్యాదతో వీడుకొల్పెను. శ్యామసుందరుని యుత్సాహ మాగదయ్యె. చావిడిలోనుండి యొకదుముకున లోనికి వచ్చి కమలను గనుసన్నచే గదిలోనికిఁ బిలిచి కౌఁగి

లించెను. అంతకుమునుపు చూచినదృశ్యము భార్యను మరల మరలఁ గౌఁగిలింప నతనిఁ బురికొల్పెను. కమల సిగ్గుతోఁ బల్కెను. "ఉన్నప్రేమనంతయు నేఁడే వెచ్చించెదరా యేమి?"

శ్యాము:— నా యానందము నేఁడు మేరగానకున్నది; నీవు నిజముగ దేవివలె నా కగపడుచున్నావు.

ఆ నాఁ డొక రాజ్యము లభించినను శ్యామసుందరుఁ డంత సంతసించియుండఁడు. అంత నతఁడు పదిమందిలోనికివచ్చి గుమిగూడియుండిన స్త్రీల కభిముఖుఁడై యిట్లనెను. "సోదరీరత్నములారా! ఆనాఁడు నే నన్నట్లు కమల నిజముగ జబ్బుపడి యుండలేదు; మీతోఁ గలసిమెలఁగ వలదని యామె నన్ను నిర్బంధించి యుండెను. కాని నేఁడామెయే మిమ్మందఱ నాహ్వానించి మీతో సోదరీభావమును వహించెను. నాకిప్పుడు కలిగిన యానందమునకు సూచనగా గ్రామమునకు వేయిరూప్యములచొప్పున నిచ్చి పదిగ్రామములందుఁ బది వ్యవసాయ నిధుల నేర్పఱచెదను. అచ్చట మీకు వడ్డీలేక యప్పుదొరకును. సాహుకారుల కపరిమితముగ వడ్డీయిచ్చి యిల్లు గుల్లచేసికొనుచున్న మీ

బాధలు నివృత్తియగును. ఎవ్వరు నేఁడు మిమ్మాహ్వా నించిరో వారే యానిధుల కధ్యక్షులుగ నుందురు."

స్త్రీలందఱు చేతులెత్తి యా దంపతులకు మ్రొక్కిరి. అంత కమల భర్తతో ననెను. "బాగుగ నున్నది; ఈబాధల నన్నిటిని నాతలపైఁ బడవైచితిరి!"

శ్యామ:— (మందహాసముతో) నీటిలో నడుగుపెట్టిన తరువాత నీవే యీఁద నేర్చుకొనఁ గలవు.

కమ:— నాకీలెక్కలు, ఏమి తెలియును?

శ్యామ:— వానియంతట నవియే తెలియఁ గలవు. రెండువారముల క్రిందనేకదా నీవు నన్నంత్య జులతోఁ గలయుట, మెలఁగుట, మానుకొన బల వంతపెట్టితివి; అట్టిదానవు నేఁడు వారల సోద రులుగఁ దలంచుచుంటివి. నాఁడు నీపంతము చెల్లెను; నేఁడు నాపంతము సాగెను!

---

# ఆత్మార్పణము

## ప్రథమ రంగము

ఉ॥..........................................పాం

చాలుర నెల్ల తీవ్ర శరజాలములం బొలియించి కాని భూ
పాలక పుచ్ఛక త్తళము..............(భారతము. శల్యపర్వము.)

పదమూఁడవ శతాబ్దారంభమున నంతమొందిన చందేలు వంశపుతుదిరాజు పరిమళదేవుఁడు. ఆకాలమున నీవంశము వారికి మహోబాయను చిన్న నగరము రాజధానియై యుండెను. మహోబా రాజ్య మప్పటిదినములలోఁ బ్రాబల్యదశనంది యుండిన ఢిల్లీ రాజ్యముతోను, కనోజు రాజ్యముతోను, భుజాస్ఫాలనము వేయుచుండెడిది. పరిమళ దేవుని దర్బారునందు, అలహుఁడు, ఓదలుఁడు, అను నిద్దఱు క్షత్రియవీరులుండిరి. వీరితండ్రి యశరాజు వీరి బాల్యముననే మరణించెను. తండ్రిలేని యాబాలురపైనఁ గనికరము వహించి పరిమళ దేవుఁడు వారిని వారి తల్లిని రాజమందిరమునకు రప్పించి రాణీమల్హాణదేవి కప్పగించెను. రాణియు

నాసోదరులను దాఁగన్న కుమారులవలె నెంతో ప్రేమ తోఁబెంచెను. కొంతకాలమునకు వారు మహావీరులై విఖ్యాతులై ఘనకార్యములవలన మహోబాకీర్తిని చిరస్థాయిగాఁ జేసిరి.

మల్హణదేవి వారిని బెంచిపెద్దలఁజేసి పోషింప చేసెను. ఆకారణమున వారు మహోబా రాజ్యము నెడ మిగుల భక్తిఁగలవారై యుండిరి. పరిమళదేవుని కొఱకుఁ బ్రాణముల నర్పించుటకు వారు సర్వదా సిద్ధముగనుండిరి. వీరసోదరుల నిర్వక్ర పరాక్రమము, చుట్టుపట్టులనుండు ననేక సంస్థానాధీశులను చందేలుల హితైషులుగ నొనర్చెను. మహోబా రాజ్యము క్రమక్రమముగా విస్తరిల్లసాగెను. యౌవనదశ ప్రాప్తించిన తరువాత నీసోదరులు విశ్రాంతిఁగొని యెఱుఁగరు. సమరాంగణమే వారికి విశ్రమస్థానము! మెత్తని పఱుపుల మీఁద వారికి నిద్రయే వచ్చుచుండలేదు.

ఆకాలమే చిత్రమైనది. ఆదినములలో విశ్రాంతిగాఁ గూర్చుండుట యనినను మరణమనినను నొకటే యర్థము. మాటలలోనే పలుమాఱు ఖడ్గము లెగయుటయు, రక్తము ప్రవహించుటయు, సంభవించుచుండెను. పలుమాఱు వివాహవేదికలే రణరంగము లగుచుండినవి.

ఎవనియింట నేని యాఁడుపిల్ల పుట్టినచోఁ గొప్ప యన ర్థముకలుగుచుండెను. వేలకొలఁది సిపాయిలయొక్కయు, బంధువులయొక్కయు, రక్తము హారణమగుచుండెను. మన వీరసోదరు లట్టికాలపు నాదర్శపురుషులు. ఆకాల మునకు సహజములగు నైతిక దౌర్బల్యములును, లోప ములును, వారిని దమకు లోఁబఱచుకొనక వదలలేదు; కాని నిజము విచారించి చూచితిమేని యవి యాకాలఁపు దోషములు కాని వారి దోషములు కావు!

---

## ద్వితీయ రంగము

ఈ సోదరుల మేనమామ మహీలుఁ డనువాఁడు చాలఁగ పటవర్తనుఁడు. వీరియాన్న త్యమును,గీర్తియును, నాతని కసూయకారణములయ్యెను. వీరి నీయున్నత స్థానమునుండి యెట్లు క్రిందికిఁబడఁద్రోయవచ్చునా యని యాతఁడు సదా విచారించుచుండెను. ఈసత్కార్య మును సాధించుటకై యాతఁడు తన జీవితమును ధార వోయఁదలఁచియుండె. కనుక నెన్నియో యత్నములు చేసి వేసరి తుదకు నెట్లెట్లో పరిమళదేవునకు దుర్బోధ చేసి యాతనిఁ దన వలలో వేసికొనెను.

ఒకనాఁడు పరిమళదేవుఁ డొంటరిగాఁ గూర్చుండి యుండువేళ మహీలుఁ డచటికి వచ్చెను. రాజాతని ముఖమున విచారలక్షణములను జూచి యడిగెను. "భయ్యా! నీముఖము వాడి యున్నది; క్షేమమే కదా!" మహీలుఁడు కన్నీరునించెను. కపటవర్తనగల వానికి తన చిత్తవృత్తులపైన నెట్టి యాధిపత్యముండునో యట్టిది సంపూర్ణ విరాగికిఁగూడ నుండదు. వాని మనస్సు దుఃఖించుచుండ మోము నవ్వుచుండును. హృదయమానంద మయమైయుండఁ గన్నులు నీరు గార్చుచుండును. అంతస్సు, అసూయాగ్నిజ్వాలలో మలమలమాఁడుచుండ, నాలుక, అమృతంపు సోనలఁగురిపించుచుండును!

"రాజోత్తమా! దేవరవారి చల్లని నీడలోనున్న నేను కోరఁదగినవస్తు వేదియును లేదు. కాని ఎవ్వారినితమ రధోగతినుండి లేవనెత్తి యున్నత శిఖరమున నిల్పితిరో, ఎవ్వారు తమ కృపచేత సౌఖ్యమున నోలలాడుచు సత్కీర్తినిజూఱఁగొనుచున్నారో, అట్టివారు తమయెడఁ గృతఘ్నులై కుట్రలుచేయుచుండుట నాహృదయమును దహించుచున్నది" యని మహీలుఁడు పలికెను.

పరిమళ దేవుఁడు, ఆశ్చర్యముతో నడిగెను. "నా సేవకులలో నిట్టివారుఁగూడ నున్నారా?"

మహా:—అయ్యా! నేనేమియు నన జాలను. దేవర హృదయము కృపాసముద్రము. దానిలోఁ బ్రాణములఁదీయు మొసలి యొకటి డాఁగియున్నది.

పరి:—ఎవఁడతఁడు ?

మహీ:—నేనే.

పరి:—(ఆశ్చర్యచకితుఁడై) నీవా?

మహీ:—అవును, దేవా ? ఆమందభాగ్యుఁడను నేనే. నేఁడు నామీఁద మొఱపెట్టుకొనుటకు నేనే వచ్చి యున్నాను. నాబంధువులయెడ నేను నెఱవేర్చవలసిన విధిగలదు; కాని అది దేవరవారి యెడ నేను నెఱవేర్చవలసిన విధికంటె మహత్తరమైనది కానేరదు. అలహుఁడు నాకు రక్తబంధువు. వానిరక్తమే నారక్తము; వానిమాంసమే నామాంసము. అయినను, తన శరీరమునఁ బొడసూపినదికదా యని రోగమును వైద్యునకెఱిఁగింపక తప్పునా? అక్కటా! 'నాబాహుబలమునఁ గదా మహారాజ్యము నిలచి యున్నది' యను నహంకారము వానిమనసున నాటుకొనియున్నది.

ఎఱ్ఱవాఱిన కన్నులతో రాజనెను "అలహులుని నేను నాపుత్రునిగ భావించుచుంటిని గదా."

మహీ:--- కాదు. అంతకన్న నెక్కువగఁ దలఁచుచుంటిరి.

పరి:---తండ్రిలేనివాఁడు కదా, నిస్సహాయుఁడు కదా యని నే నాతని నెత్తికొని ప్రేమించుచుంటిని; జాగీరులిచ్చితిని; సేనాధీశుని జేసితిని; ఆతని వివాహసమయమున నే నిరువదివేల చందేలు శూరులఁ గోల్పోయితిని; వాని తల్లియు మల్హాణ దేవియు పౌరుపనుమాట నెఱుఁగక యనేక వత్సరములు కలసి మెలసి యుండిరి. అట్టివాఁడు నాయుపకారమును మఱచునా? నేను నీమాట నమ్మఁజాలను.

మహీలునిమోము వెలవెలఁబాఱెను. కొంత ధైర్యముఁ దెచ్చికొని, యతఁడనెను "అయ్యా! నానాలుక యెన్నఁడును నబద్ధమాడి యెఱుఁగదు."

పరి:---నాకేమి నమ్మకము?

మహీలుఁడు మెల్లగా నేదో రాజు చెవిలోఁ జెప్పెను.

---

## తృతీయ రంగము

'రాజుగారు పిలుచుచున్నా'రని భటుఁడొకఁడు వచ్చి విన్నవించు నపుడు మన వీరసోదరులు విశాలమగు నొక మైదానమందు సేనా విన్యాసమున నిమగ్నులై యుండిరి. రాజుగారి యాజ్ఞవినఁగానే, అలహుఁడు, భటుని వెనువెంట దర్బారునకు వచ్చి పరిమళదేవునకు సవినయముగ నమస్కరించెను.

పరి:--- నేనొకటి యడిగెదను. ఇచ్చెదవా ?

అలహుఁడు నిష్కపటముగా ననెను "చిత్తము, సెలవియ్యవచ్చును."

పరి:---మాట తిరుగవు గదా !

అలహుఁడు, కనుఁగొనల మహీపాలునిజూచి యేదో దుస్తంత్రము జరిగినదని యనుమానించెను. 'కానిచో నితని మొగమున నీచిఱునవ్వేల? రాజు నావిశ్వాసమును పరీక్షించుచుండవచ్చును' అనుకొని వచించెను. "మహారాజా ! ఇంతకు ముందు దేవరవారి నోటనిట్టి ప్రశ్న విని యెఱుఁగను. తమరు నా పోషకులు; నాహితైషులు; నాప్రభువులు. దేవర కనుసన్న మాత్రమున నగ్నిజ్వాలలో దుమికెదను. మృత్యువుతోఁ బోరాడె

దను!! ఏలికయాజ్ఞ యయ్యోనేని యసంభవమును సంభ
వముగఁ జేసెదను. నన్నిట్లు ప్రశ్నింపవలదని విన్న
వించుకొనుచున్నాను.''

పరి:---సెబాసు ! నీవట్లుచేసెదవని నాకాశ గలదు.

అల:---నాకేమి యాజ్ఞ ?

పరి:---'నాహారు'అను పేరుగలగుఱ్ఱము నీయొద్దనున్నది
కదా!

అల:---'చిత్తము. ఉన్నది.' యని మహీపాలునిపైనఁ దన
నేత్రాగ్ని గురిపించెను.

పరి:---నీకిష్టమైనచో దానిని మాకిమ్ము.

అలహాండు మారుపలుకలేక పోయెను "మాట
తిరుగనని, ఇప్పుడేకదా ప్రతిజ్ఞచేసితిని. ఇయ్యనని యం
దునా ? ఈసమయమున రాజు నాకృతజ్ఞతను బరీక్షింపఁ
దలఁచుచున్నాఁడు. నామాటను చెల్లింపకపోయితినా
యుపద్రవము వాటిల్లును. ఉపద్రవమువచ్చిన మానె:
ఇయ్యనని యెట్లందును? నన్ను విశ్వాసహీనునిగఁ దలం
పఁడా ? రాజునకు నేను సామాన్యుఁడనగు సేవకుఁడను
గానే ! నేనాయన ప్రక్కలోను రెక్కలోను బెరిగితిని.
నాకాలు సేతులలో బలములేనికాలమున నాకృత్యముల

నాయన సహించుకొనెను; నన్నుఁ బుత్రునివలెఁ బ్రేమించెను! అట్టి వానికోరికను జెల్లించకుండఁగలనా?"

భావము లింకొక మార్గమున మఱలెను. "రాజు నాకుఁ జేసిన యుపకార మపరిమిత మనుట నిజమే. నాశరీరములోని యొక్కొక యణువు నాతని యుపకార భారమును వహించి యున్నదను మాటనిజమే. కాని క్షత్రియుఁడు తనగుఱ్ఱము మఱొకనికియ్యఁడు. ఇది క్షత్రియ ధర్మము. నే నతని యన్నముఁ దిని బ్రతికినవాఁడను. ఈశరీర మాతనియౌదార్యముచేఁ బెరిగినది. నాశరీరముపైన నాకు సంపూర్ణాధికారము గలదు. దానిని నేను రాజునకర్పింపఁగలను. కాని క్షత్రియ ధర్మము నాచేతిలోనిదికాదు. నేను దాని నతిక్రమింపఁ జాలను. పవిత్రమగు క్షత్రియ ధర్మమును లోహదుర్గముగ భావించిన వీరపుంగవుల మూలముననే కదా దానికీర్తి నేఁటికిని బ్రకాశించుచున్నది. నాపేరునకుఁ జిరస్థాయియగు కలంకము నె ట్లాపాదించుకొందును? అక్కటా! మహీపాలుఁడు నన్నెట్టి స్థితిలో నిఱికించినాఁడు! 'వెనుకకుఁ బోయినఁ గోయి, ముందునకుఁ బోయిన నూయి' అనునట్లున్నది. క్షత్రియధర్మమునకుఁ గలంకమునైనఁ దెచ్చిపెట్టవలయును; స్వీయవినాశ

మునకైన నొప్పుకొనవలయును! ఎట్లైనను సరే. కృతఘ్నుఁడనైన నగుదుఁ గాని, ధర్మాతిక్రమణము నా కిష్టము లేదు. నా యాన్నత్య మధోగతి పాలైనను మానె; క్షత్రియ ధర్మమునకు దుష్కీర్తిఁ దేఁజాలను!"

అలహుఁడిట్టి విచారమునఁదలవాల్చి యాలోచించుచుండెను. పాపము, అది యాతనికిఁ బరీక్షా సమయము. ఈ పరీక్షయందలి గెలుపుపైననే యాతని భవిష్యత్తాధారపడి యున్నది! మహీలుని హృదయ మానందమున మునిఁగియుండెను.

అంతలో, పరిమళదేవుఁడు బిగ్గరగా ననెను. "ఏమి యాలోచించుచున్నావు. ఇచ్చట కిష్టము లేదా?"

అలహు:— (కన్నుల నేలవాల్చి) "అయ్యా! ఇష్టము లేదు."

పరిమళదేవుఁడు కోపోద్దీపితుఁడై ఖండితముగఁ బల్కెను "ఏందుచేత?"

అలహుఁడు నిబ్బరముగ ననెను "అది క్షత్రియ ధర్మమునకు విరుద్ధము గనుక."

పరిమ:— అలహా! నేను మీకుఁ జేసిన యుపకారమున కిదియే ప్రతిఫలము? ఎఱుఁగుదువు

గదా నీవ్వెకప్పు డెట్టి స్థితియం దుంటివో,
ఇప్పు డెట్టిస్థితియం దున్నావో!

అలహు:— చిత్తము; ఎఱుఁగుదును.

పరిమ:— తెలియును గదా ఎల్లు బాగుచేసితినో యట్లే
నిన్ను చెడఁగొట్టఁగలనని!

అలహుని సహనశక్తి తగ్గెను. కన్ను లెఱ్ఱ
నయ్యె. కొంచెము కఠినమగు ధ్వనితో ననెను. "రాజేం
ద్రా! తమరు నాకుఁ జేసిన యుపకారమునకు సదా
కృతజ్ఞుఁడనై యుందును. క్షత్రియుఁడగువాఁడేనాఁడును
నుపకారమును మఱువఁడు. తమరు చేసిన యుపకార
మునకు నేనును బ్రాణముల కాసింపక ప్రతిఫల
మొనర్చితిని. పలుమాఱులు నేను చూపిన ప్రభు
భక్తిని, ఆత్మార్పణాసక్తిని, కేవలము జీతము తినినంత
మాత్రమున నెవఁడును జూపియుండఁడు. ఇఁక దేవర
వారి దర్బారునందు నాకు జీవనము లేదని తోఁచు
చున్నది. ఇదియే నాతుది నమస్కారము. తెలివి
లేమిచే నేను చేసిన యపరాధములను క్షమింపఁ
బ్రార్థించుచున్నాను"

---

## చతుర్థ రంగము

అలహాని తల్లి పేరు దేవలదేవి. భావౌన్నత్యము చేతను, సద్వర్తనముచేతను, భారతవర్షము యొక్క పూర్వచారిత్రమును పవిత్రముగ నొనర్చిన నారీరత్నములలో నామెయొకతె. పరస్పర వైషమ్యమువలనను, స్వార్థపరత్వమువలనను, మన దేశమంధకారమయమై యుండిన కాలమున సైతము దేశచరిత్రమును కాంతిమంతముగఁ జేయు వనితామణు లిచ్చట జన్మించిరి. అలహుఁడు చూపిన ధర్మపరాయణత్వము వినిన దేవలదేవి కన్నుల నానందాశ్రువు లూరెను. పుత్రులఁ గౌఁగిలించుకొని యామె పలికెను "నాయనలారా! మీరు క్షత్రియధర్మమును బాలించితిరి. మీయట్టి పుత్రులఁ గని నే నెంతయు ధన్యురాలనైతిని."

ఆనాఁడే వారు మహోబా వదలి వెడలిరి. తమ యశ్వములను దప్ప వారు మఱేవస్తువును వెంటఁ దీసికొనలేదు. తమ సామానును నంతను నచ్చటనే వదలిరి క్షత్రియుని యైశ్వర్యమును గౌరవమును నతని ఖడ్గమునందే యుండును! ఎవ్వాఁడు శౌర్యధనుఁడో వాని కితర ద్రవ్యములతోఁ బనియేమి?

అది వర్షకాలము. నదీ నదములు పుక్కిలి పాఱుచుండెను. ఇంద్రుని యౌదార్యముచే భూదేవి యలంకృతయై యుప్పొంగుచుండెను. నెమళ్లు చెట్లపై నెక్కి క్రేంకారములు సేయుచుండె. సేద్యగాండ్రు పొలములలో సృష్టిసౌందర్యదర్శనమున నున్మాదులై పాటలు పాడుచుండిరి. పచ్చని పచ్చికతోఁ గప్పఁబడియున్న పర్వతములతోను, కఱఁగిపోసిన వెండినీటిఁబోలు స్వచ్ఛజలముతో నొప్పుతటాకములతోను, ప్రకృతి సొంపునింపుచుండెను. బయళులందు వీచుచుండిన చల్లనిగాలియు, నడవి పూవులు వెదఁజల్లుచుండిన కమ్మని తావియు, వాయువుచే శిరఃకంపము చేయుచుండిన వృక్షాగ్రములును, మనమునఁ గోరికలను బుట్టించుచుండెను. అట్టి మనోహరమగు కాలమున నాసోదరు లిరువురు మహోబాపురమును వదలి వెడలిరి. వారి కన్నులశ్రువుల రాల్చి రాల్చి యెఱ్ఱఁబడెను. ప్రేమాస్పదమగు జన్మభూమిని వారు వదలవలసిన వారైరి. ఏనగర వీథులలో వారు తప్పటడుగు లిడనేర్చుకొని యుండిరో, ఎచ్చటి చెఱువులలో వారు తమ బాల్యమున కాగితపు పడవలను వేసి యాడుకొనియుండిరో, ఎచ్చట వారు యౌవనకాల సౌఖ్యముల ననుభవించి యుండిరో,

అట్టి 'మహోబా'పురమునకు వారు దూరస్థులగుట
సంభవించెను. ముందునకుఁ బోవుచుండిరికాని యడు
గులు సాగుటలేదు. పరిమళదేవుఁడు, ఎవరినైన నంపి
తమ్ముర మ్మనుచున్నాఁడేమోయని వారు మాటిమా
టికి వెనుకవంకఁ దిరిగిచూచుచుండిరి. పోనుపోను
మహోబా పర్వతము లదృశ్యము లయ్యెను. అంత
వారి యాశ నిరాశ యయ్యె. దీర్ఘనిశ్వాసమును విషా
దముతో వదలి గుఱ్ఱముల నదలించిరి. వీరు దేశాంతర
గతులైన వార్త నలుదెసల వ్యాపించెను. అట్టి వీరపుంగ
వులకుఁ దావులేని దర్బారుండునా? అన్నిదిశలనుండియు
నాహ్వానములు రాసాగెను. కనోజురాజు, జయచంద్రుఁడు,
వారిని దోడితెచ్చుటకుఁ దనకుమారునంపెను. వారును
రాజకుమారుని సత్కారమునకును, నుత్సాహమున
కును, సంతసించి కనోజుపురమునకు వచ్చిరి. వారి
రాకకై నిరీక్షించుచుండిన జయచంద్రుఁడు, ఆలహునిఁ
దన సేనాధీశునిఁగాఁ జేసికొనెను.

---

## పంచమ రంగము

మన వీరపురుషు లిరువురును వెడలిపోయిన
పిమ్మట 'మహోబా' రాజ్యమున దురాగతము లా

రంభ మయ్యెను. పరిమళదేవుని దౌర్బల్యమును గని పెట్టి మాండలికరాజులు తిరుగఁబడిరి. వీరి నడఁచిపెట్టు ప్రబలశక్తి రాజ్యమున లేదయ్యెను. ఒకనాఁడు ఢిల్లీశ్వరుఁడగు పృథ్వీరాయని సైన్యములు 'సమతా'యను స్థలమునకుఁబోయి విజయోపేతములై మఱలి వచ్చుచు మార్గమధ్యమున మహోబాయందు దిగెను. మూర్ఖులగు సిపాయిలలోఁ గత్తు లెగురుట కెంతసేపు పట్టును? పరిమళదేవుని యుద్యోగియుల పొరపాటైన నేమి; చౌహాణుల తప్పిదమైన నేమి, మొత్తముమీఁద చందేలులకును, చౌహాణులకును, పోరు తారసిల్లెను. చౌహాణులు స్వల్పసంఖ్యాకు లగుటచే, చందేలులు, ఆతిథ్యధర్మముల నడఁగఁద్రొక్కి, వారినందఱను సంహరించి సంతసించిరే కాని యీ దుష్కృత్యమునఁ దమ కెట్టి కీడు మూడనున్నదో తెలియలేకపోయిరి. ఈ దుర్వార్త వినినంతనే పృథ్వీరాయని యాగ్రహమునకు మేరలేక పోయెను. భయంకరమగు పెనుగాలివలె నతఁడు మహోబాపై కెత్తివచ్చి 'మహోబా' రాజ్యములోని ప్రసిద్ధనగరమగు సరసాపురమును నాశనముచేసి రాజధానివైపు మఱలెను. చందేలులుకూడ సమరసన్నాహములు చేసిరికాని యంతకుముందు, చౌహాణులతోఁ జేసిన

యుద్ధమువలన వారలసియుండిరి. అంతేకాక, అల హుడు, ఓదలుడు, లేనిసేనలు పెండ్లికొడుకులేని యూరేగింపువలె శోభారహితములై యుండెను. సైనికులు ధైర్యమును వీడసాగిరి. దేశమున హాహాకారములు వెడలెను. మఱియొక నిమిషమున పృథ్వీరాజు మహోబాపైన నచ్చిపడునను భయము జనులను నిర్విణ్ణులుగాఁ జేసెను. పరిమళదేవుఁడు జరిగినదాని కెంతయుఁ బశ్చాత్తాపము నొందెనుకాని దానివలన నేమి ప్రయోజనము? మార్గాంతరముఁ గానక, అతఁడు, 'యుద్ధమున కొకనెల గడువిం' డని పృథ్వీరాయని వేడికొనెను. చౌహాణవీరుఁ డెంతటిశూరుఁడో యంతటి యుద్ధధర్మమును బాటించువాఁడు. దుర్బలుఁడుగాఁగాని, అజాగ్రత్తతోఁగాని, యున్న శత్రువును నతఁ డెదుర్కొనఁదలంపఁడు. రణధర్మము నతఁ డట్లు పాలించియే యుండనిచో షహాబుద్దీనుచేతఁ బడునట్టి దుర్దినము వచ్చియే యుండదు! అతనిధర్మనిరతియే యతని ప్రాణశత్రు వయ్యెను! అదియట్లుండె. పృథ్వీరాయఁడు పరిమళదేవుని సందేశము నంగీకరించి సేనలను మఱలించుకొనెను. 'నేఁటికి బ్రతికితిమిరా దేవుఁడా' యని చందేలులు కొంత సంతసించిరి.

ఢిల్లీశ్వరునితో నెట్లు సమరము సేయవచ్చునను విషయమును 'మహోబా' రాజ్యహితైషు లందఱు తల లొకచోఁజేర్చి విచారింపసాగిరి. నగరముచుట్టును దుర్భేద్యమగు గోడఁబెట్టింతుమని కొందఱును, మహోబాను నాశనదేవత కప్పగించి దక్కనునకు బోవుదమని మఱికొందఱును, అభిప్రాయ మిచ్చుచుండిరి. సంధిచేసికొనుట తప్ప నుపాయాంతరము పరిమళదేవునకుఁ గానరాదయ్యె. అప్పుడు మల్హణదేవి లేచినిలచి యిట్లనెను:-

"చందేలువంశజులగు క్షత్రియులారా! బాలురవలె నర్థములేని మాటలేల యాడెదరు? గోడలు మనను శత్రువులబారినుండి తప్పింపఁగల్గునా? వృక్షము లెన్నఁడైనను గాలి నాపఁగలవా? మహోబాను విడచిపోవుద మనుమాట, ఆఁడువాండ్రనఁదగినది కాని మీరు చెప్పవలసినదా? మీశౌర్యము, మీయాత్మార్పణము, నేఁడెచటికిఁ బోయినవి? మొన్న మొన్నటివఱకుఁ గదా చందేలులపేరు శత్రువులగుండియల నవియఁజేయుచుండెడిది! కడచిన కొన్ని సంవత్సరములలో మీరు వందలకొలఁది యుద్ధములందు గెలుపొందితిరి! పరాజయ మనునది మిమ్మెన్నఁడైన వచ్చితాకెనా? మీ ఖడ్గముల మెఱపు లెన్నఁడేని మందగిల్లెనా? అట్టి ఘన

కార్యములు చేసిచూపినవారు మీరే. కాని మీ యం దప్పటి పౌరుషము పోయినది. ఆపౌరుష మా సోదరద్వయముతోఁ గూడ 'మహోబా'ను వదలి పోయినది! దేవలదేవి తోఁబాటు జయలక్ష్మికూడ మనలను త్యజించినది! వేయేల? మన యీ దుస్స్థితిని బోఁగొట్టఁగలవాఁ డొకఁడే కలఁడు! ఆతఁ డెవఁడు? అలహుఁడే! ఆసోదరులే యీ సందిగ్ధావస్థయందు మనలఁ గాపాడఁగలరు. వారినే సమాధాన పఱచుకొనుఁడు! వారినే బ్రతిమాలుకొనుఁడు! మహోబా వారికి చేసిన యుపకారము లెన్నియో కలవు. మహోబా యోషధులును, మహోబా జలమును వారిని బోషించినవి! మహోబాయెడఁ దమకుఁగల విధులను వా రెన్నఁటికిని మఱువరు! రాఁబోవుయుద్ధమున విజయలక్ష్మిని జైకొనుటకు వలయు సామర్థ్యమును, విద్యను, ఈశ్వరుఁడు వారికే ప్రసాదించి యున్నాఁడు!”

మల్హాణదేవి వచనములు జనుల మనములలో నాటుకొనెను.

---

## షష్టమ రంగము

మన కథానాయకులను బిలుచుకొని వచ్చుటకై జగన్నాథభాటుఁడు కనోజు ప్రవేశించువఱకు వారు వేఁటకుఁబోవుచుండిరి. భాటుఁడెదురై రాఁగానే వా రాతనికి నమస్కరించిరి. అతని ముఖమున నవమానమును, సిగ్గును, చిత్రితములై యుండెను. అలహుఁడు తత్తఱముతో నతని నడిగెను "కవిశేఖరా! దారి తప్పి వచ్చినట్లున్నది! మహోబాయందు నందఱు క్షేమముగా నున్నారా? మేమెట్లు జ్ఞప్తికి వచ్చితిమి?" కన్నిటితో భాటుఁ డిట్లనియె. "శూరపుంగవులారా! క్షేమముగా నుండినచో మీ శరణేల చొచ్చియుందుము? ఆపత్కాలముననేకదా దేవతలు జ్ఞప్తికి వచ్చెదరు. 'మహోబా' పైన నేఁడు, ఈశ్వరున కాగ్రహము వచ్చినది. పృథ్వీరాయఁ డిప్పుడానగరమును ముట్టడించి యున్నాఁడు. నరసింహుఁడును, వీరసింహుఁడును, శత్రు కరవాలముల కర్పితులై యున్నారు. సరసాపురము బూడిదకుప్ప యైనది. చందేలులరాజ్యము నాశనము కానున్నది! దేశమం దెల్లెడల దుఃఖారావములు ప్రబలినవి. ఎంతో కష్టముమీఁద నొకమాసము గడువు దొరకినది. పరిమళదేవుఁడు నన్ను మీకడకుఁ బంపి

నాఁడు. ఈ యాపత్కాలమున మాకు దిక్కెవ్వరును లేరు. మాకు ధైర్యమిచ్చువా రెవ్వరును గానరారు. మీరు మహోబా వదలిననాఁటినుండి యొకసారి యైనను బరిమళదేవుని పెదవులపైనఁ జిఱునగవు కానరాలేదు. ఎన్నియోదినములనుండి యాతనికన్నులు నిద్దుర నెఱుఁగవు. మిమ్ముఁ దనప్రక్కలోను జెక్కలలోను బెంచిన మల్హాణదేవి రాత్రిందివములు మీకొఱకుఁ గన్నీరు గార్చుచున్నది! క్షత్రియవంశ సత్పుత్రులారా! చందేలులనావ మునుఁగుచున్నది; చందేలుల పేరు నిముసములో నశించిపోవ నున్నది! ఇదే సమయము! ఖడ్గములఁ బూనుఁడు! మునుఁగుచున్న యీ నావను వెంటనే పైకెత్తరేని చిరకాలము వగవవలసి వచ్చును. ఈ నావతోఁగూడ మీపేరేకాదు శూరశిఖామణి యగు మీ తండ్రిపేరు కూడ నశింపగలదంట నున్నది!”

అలహాఁడు ముఖము చిట్లించి బదులు చెప్పెను. “ఏమైనను కానిమ్ము మాకావిషయమున జాలిలేదు. మాతండ్రిపేరు నేఁడు మునుఁగుటల? ఏనాఁడు మమ్ము నిష్కారణముగ మహోబానుండి వెడలఁగొట్టిరో యానాఁడే మునిఁగెను. మహోబా మంటఁగలియనిమ్ము;

చందేలుల దీపము కొండ నెక్కసిమ్ము. మాకేమాత్ర
మును జంత లేదు. మహోబాకొలకు మే మొడిపిన
చెమటకు మమ్ము వెడలఁగొట్టుటయా నాప్రతిఫలము ?
మాతండ్రి మహోబాకొలకుఁ దన ప్రాణముల నర్పిం
చెను. మేము గోండులను జెండాడితిమి ; చందేలులకు
దేవగడ మిప్పించితిమి; యాదవవంశముతోఁ బోరాడి
తిమి; కట్యారుబయళ్లలో,చందేలుల పతాకమును నాటి
తిమి; ఈచేతులతోనే కదా నేను ఘ్యాహుల సేనా
ప్రవాహము నష్టగించితిని; గయలో యుద్ధమును మేమే
గెలిచితిమి; రేవాను గర్వమును మేమే భంజించితిమి ;
మేవాతులనుండి పన్నులఁగొంటిమి ; ఈపనులన్నిటికి
మాకు వచ్చిన బహుమాన మిదియే ? మాతండ్రి పది
నుండి రాజులను మహోబాదర్బారునకు మాండలికులఁ
జేసెను. పరిమళ దేవుని కొలువున నే నేడుమారు
లసాయకరములగు గాయముల నొందితిని. మూఁడు
మారులు మృత్యుముఖమునుండి వెడలితిని. ఓట
మనునది లేక నలువది యుద్ధములఁ జేసితిని. ఓదలుఁ
డేడురణాంగణములలో జయముఁగాంచెను. చందేలుల
ప్రతాపమును మేము దిగంతములఁ జాటితిమి. చందేలుల
కీర్తిని నీ మాకాశమున కంటించితిమి. ఇట్టి సేవకు

ప్రతిఫలము మాకులభించినది. మహీలుని సంతోష పెట్టుటకే కదా పరిమళ దేవుఁడు మమ్ము దేశాంతర మున కంపెను; ఆమహీలునే యిప్పుడేల పిలుపించు కొనఁడు ?"

జగన్నాథుఁడిట్లు ప్రత్యుత్తరమిచ్చెను. "అలహా! క్షత్రియులనవలసిన మాటలాయివి ? ఏరాజ్యముకొఱకు మీతండ్రి ప్రాణముల నర్పించెనో, ఆరాజ్యమే యిప్పుడు శత్రుపాదముల క్రిందనడఁగి పోవుచున్నది. అంతటివాని పుత్రుఁడవగు నీకు రోషములేదా ? తన రాజును నాప దలలో వదలి తటస్థుఁడుగానుండు క్షత్రియునకు నర కాగ్నికన్న వేఱాశ్రయముకలదా ? నీమాతృదేశము పైన దుర్దశామేఘము లావరించి యున్నవి. మీతల్లులు మీయక్క చెల్లెండ్రు, శత్రువులచేత నవమానము పాలగు చున్నారు! ఇఁకనైన మీకు జాలికలుగదా ? మాతృదేశ మిట్టిదుర్గతియందుండ, కనోజులో మీకెట్లు సుఖనిద్రపట్టును ?"

జగన్నాథుఁడువచ్చిన వార్తదేవలదేవికిఁ దెలిసి నందున నామె తత్క్షణమే కుమారులను బిలచి యనెను. "నాయనలారా ! గడచిన దానిని మఱచిపొండు. నేఁడే మహోబాకు ప్రయాణముకండు."

అలహాఁడేమియు మాట్లాడలేదు. కాని ఓద లుఁడు కోపముతో ననెను. "మహోబాకుఁబోవుట మాకిష్టములేదు. మనలనువారు కుక్కలవలె మహోబానుండి పాఱఁదోలిన దినమును మఱువఁజాలము. మహోబామునిఁగినను సరే తేలినను సరే. దానిని జూచు కోరికయు మాకులేదు. కనోజే మాకు మాతృభూమి !"

దేవలదేవి కీవాక్యములు ములుకులవలెఁదోఁచెను. రౌద్రమూర్తియై యనెను, "ఓదలా ! ఇట్టిమాటలు పలుకుటకు నీకు సిగ్గులేదా ? ఇట్టిపుత్రులఁగనుటకన్న గొడ్రాలనైన బాగుండెడిది. కులమునకుఁ గలంకము నాపాదించు పుత్రులను గనుటకా నేను గర్భవేదనను సహించినది? దురాత్ములారా! నాయెదుట నిలువవలదు. మీముఖముఁ జూడఁగూడదు. మీవంటి మూర్ఖులు యశరాజునకుఁ దగిన పుత్రులుగానేరరు !"

ఈమాటలు వారి హృదయమున బాకుపోటులై నాటెను. వారినుదుటఁ జిఱుచెమట గ్రమ్మెను. లేచి నిలచియనిరి "అమ్మా! శాంతింపుము. ఇఁక మమ్ము నీశూలములచే నొప్పింపకుము. నేఁడే మహోబాకుఁ బోయెదము. పరిమళదేవుని కార్యమున మారక్తము

నోడిపెదము. రణరంగమున మాఖడ్గముల కాంతితో మాతండ్రి కీర్తిని ప్రకాశింపఁ జేసెదము! చౌహాణుల తోడిపోరున శౌర్యమును ప్రదర్శించి దేవలదేవిసుతుల యశమును నజరామరముగఁ జేసెదము!"

---

## సప్తమ రంగము

సోదరు లిరువురును తల్లితోఁగూడ కనోజువదలిరి. వీరు 'మహోబా'కుఁబోవఁగానే వాడిన చేల మీఁద వర్షము కురిసినట్లయ్యెను. భిన్నభిన్నములైన హృదయశకలము లతికికొనెను. శూరాగ్రేసరులకు స్వాగతమిచ్చుటకై యొక లక్షచందేలు నిలువఁబడిరి. దేశాంతరగతులైన సోదరు లెంతో కాలమునకు దేశసోదరులఁ గలసికొనిరి. ఆనందబాష్పములు కన్నులఁ గ్రమ్మెను. వీరిరాక విని పరిమళదేవుఁడు కీర్తిసాగర మను సరోవరమువఱకు నెదుర్కొనుటకై కాలినడకనఁ బోయెను. వీరసోదరులు పఱువునఁబోయి పరిమళ దేవుని పాదములమీఁద వ్రాలిరి. మువ్వురికన్నులనుండి స్రవించిన కన్నీటి ప్రవాహ మంతకుఁ బూర్వము వారి హృదయములందుండిన మాలిన్యమును గడిగి వేసెను.

శత్రుసేనలు సిద్ధముగా వచ్చియే యుండుటవలన నాతిధ్యసత్కారముల కవకాశము లభింపలేదు. కీర్తి సాగర తీరముననే చందేలు మహాపురుషులయొక్కయు మంత్రిగణముయొక్కయు నాలోచన ననుసరించి, అలహుఁడు సేనాధిపతిగా నభిషిక్తుఁడయ్యెను. అచ్చటనే, దేశారాధనమున నవసరమైనచోఁ జచ్చుటకును జంపుటకును శపథములు జరిగెను! అచ్చటనే, చందేలు వీరులు రణరంగమునుండి ప్రాణములతోఁ గదలమని ప్రతిజ్ఞచేసిరి! అచ్చటనే జనులొకరి నొకరాలింగనము చేసికొని, యదృష్టములను భవిష్యత్తున కప్పగించి సాగి నడిచిరి! ఆనాఁ డొకరి ముఖమున నైనను దుఃఖచిహ్నములు లేవు. ఒకరి చూపులందైనను విన్నఁదనము లేదు. స్త్రీలు వికసిత ముఖకమలములతోఁ దమ ప్రియులను వీడుకొల్పుచుండిరి. పురుషు లానందముతోఁ బ్రియురాండ్ర నెడఁబాయుచుండిరి. ఇదియే తుదిపందెము. దీనిని గెలుచుటయే బ్రతుకు; దీనినోడుటయే చావు!

ఇప్పుడు 'ఓరాయి' యను గ్రామమున్నచోట నుభయసైన్యములు డీకొనెను. పదునెనిమిది దినముల వఱకుఁబోరు ఘోరముగ జరుగుచుండెను. పృథ్వీరాయుడు స్వయముగా సేనలనడపుచుండెను. ఇరువాగుల వారు

ధైర్యముతోఁ బోరి యచ్చటనే మరణించిరి. మూఁడు లక్షల సేనలో ముగ్గురు మాత్రము మిగిలిరి. మొదటి వాఁడు పృథ్వీరాజు; రెండవవాఁడు చాందుబాటు; మూఁడవవాఁ డలహుఁడు. చందేలులోడిరి. వారి పేరు దేశచరిత్రలో మాసిపోయెను. స్థానేశ్వరమున ముందు జరుగఁబోవు యుద్ధముయొక్క ఫలితముకూడ నిచ్చటనే ప్రకటితమయ్యెను. ఏలయన, చౌహాణులయొద్ద నుండిన శూరసైనికు లందఱు నీయుద్ధముననే మడియుటవలన, షహాబుద్దీనుతోఁ జేసిన సమరమునందు ననుభవశూన్యులగు క్రొత్తసిపాయీలు రణాంగణమునకు రావలసివచ్చెను. పర్యవసానమెట్లుండుట సహజమే యట్లే యుండెను. అలహునిజాడ తరువాత నెచ్చటను గానరాలేదు. సిగ్గుచేత నాత్మహత్యచేసికొనెనో యోగులలోఁగలసెనో తెలియదు. అతఁడింకను బ్రతికియున్నాఁడని జనసామాన్యముయొక్క విశ్వాసము. అది నిజమే. అతఁడెప్పటికిని బ్రతికియేయుండును!

---

PRINTED AT THE ANDHRAPATRIKA PRESS:—MADRAS.

# అపూర్వ గ్రంథములు

## సతీదేవి - సావిత్రిదేవి - విదుషీమణులు

వివాహములయందు వధూవరుల నాశీర్వదించి యొసంగుటకును, దసరా, సంవత్సరాది మొదలగు పండుగులయందు బహుమతియొసంగుటకును సర్వాంగ సుందరమగు గ్రంథములు లేనిలోపము నేడుతీరినది.

## విదుషీమణులు

వేదకాలము మొదలుకొని ధారావాహికముగ భారతవర్షమందలి విద్వాంసురాండ్ర చరిత్రము లిందు వర్ణింపబడినవి. శ్రీయుత కోపల్లె హనుమంతరావు ఎం.ఏ. బి.ఎల్. గారు, ఉపోద్ఘాతము వ్రాసియున్నారు.

కాలికో రు. ౦-౧౨-౦ రాపరు ౦-౯-౦

## సీతాదేవి వనవాసము

(ద్వితీయ ముద్రణము)

అనగా నుత్తరరామచరిత్ర. కరుణరసపూరితము. పండితయీశ్వరచంద్ర విద్యాసాగరులవారి బంగాళీ గ్రంథమున కాంధ్రీకరణము. ఎల్లరు చదువదగినది.

౧౪౦ పుటలు. వెల రు ౦-౬-౦

# భక్తియోగము

(ద్వితీయముద్రణము)

బాబు అశ్వనీకుమారదత్తు ఎం.ఏ.,బి.ఎల్. గారి బంగాళగ్రంథమున కాంధ్రీకరణము. ఉత్కృష్ట గ్రంథ మని పండితులెల్లరు బొగడియున్నారు. ౩౬౦ పుటలు.

కాలికో వెల రు. ౧-౦-౦ రాపరు ౦-౧౨-౧

# తుకారాముచరిత్ర

(ద్వితీయముద్రణము)

మహారాష్ట్రజాతీయోద్ధారకుడును, మహాభక్తు డగు తుకారామునిచరిత్ర నెల్లరు బఠింపదగినది. ఇందు తుకారాముని చిత్రపటము గలదు. భక్తిరసపూరితము ౧౮౦ పుటలు. వెల రు. ౦-౬-౦

# జ్ఞానామృతము

ఇది యజ్ఞానమునుండి మేలుకొలిపి శాశ్వతపద వికి మార్గములను, నీతి భక్తి జ్ఞాన వైరాగ్యములను బోధించువాక్యముల కునికిపట్టు. సద్గుణాభ్యాసములకు సులభోపాయము లిందనేకములు గలవు. సూచిపద్య ములు శ్లోకములిందు జేర్పబడినవి. వెల రు. ౦-౦-౬.

చిరునామా:—సరస్వతీనికేతనము

బందరు.